BRITANNIA®
Eat Healthy, Think Better



# చిన్న టైగర్ పెద్ద శక్తి






Rs.2
for 20gms

ఎగరేసి తినడానికి వీలైన కరకరలాడే బిస్కెట్స్, పాలు మరియు చాకొలేట్ రుచులలో, తీపి ముక్కలతో అలంకరింపబడినవి. చిన్న టైగర్, వీఎద్ద శక్తి కోసం తమాయా మార్గం

# JANMASHTAMI, GANESH CHATURTHI, ONAM, DUSSERAH, DIWALI

# THE FESTIVAL SEASON IS ON!

## CHANDAMAMA OFFERS THE IDEAL GIFT FOR YOUR DEAR ONES






FUN WORK SHOP

RS. 199/- ONLY

With a simple click and drag movement of the mouse, Chandamama Fun Workshop promises hours of fun.




We have over a half-million words in English to communicate with, but half of everything we write and read depends on 300 most frequently used words. But many of these words cannot be sounded out, so they must be learned as sight words.
JATAKA TALES - Early Reader Series (Level 2) teaches children to instantly recognise 100 of these sight words.

JATAKA TALES

LEVEL II

RS. 199/- ONLY



TRAPPED




The renowned Indologist Professor Purenuthin is trapped inside the Mound of Murukki. You search through 12 different games and activities to find clues and keys to save the professor.

RS. 199/- ONLY



**Send Rs 400 (by M.O. or DD) and Receive all three CD-Roms. You May Also Buy Individual CD.**

*Mail your order to:* Chandamama India Limited
82 Defence Officers Colony, Ekkatuthangal, Chennai 600 032.

**FESTIVAL OFFER: BUY 2, GET 1 FREE!**



చందమామ సంపుటి: 60 ఆగస్ట్ 2007 సంచిక:8

## ఈ నెల విశేషాలు

















## ఈ సంచికలో...





వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

## అమరవాణి

ఇతరులకు
ఉపయోగ పడడం
కోసమే చెట్లు ఫలాలు
కాస్తున్నాయి; నదులు
ప్రవహిస్తున్నాయి;
గోవులు
పాలిస్తున్నాయి.
పరులకు ఏదైనా
ఉపకారం చేసినప్పుడే
మన జీవితం (శరీరం)
సార్థకమవుతుంది!







# వజ్రోత్సవం - వజ్ర సంకల్పం!

**1947** ఆగస్ట్ 15వ తేదీ స్వతంత్ర భారతదేశం ఆవిర్భవించింది. అరవై యేళ్ళనాడు భారతీయులకు స్వాతంత్ర్యం అంటే పరాయిపాలన నుంచి విముక్తి. 'స్వాతంత్ర్యం' అంటే అది 'సంపూర్ణస్వరాజ్యం' కావాలని మనపెద్దలు కాంక్షించారు. ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నుకోబడిన ప్రతినిధులు దేశాన్ని నడిపిస్తున్నారు.

బలమైన సమైక్య దేశనిర్మాణమే లక్ష్యంగా ప్రణాళికలు రూపొందించబడ్డాయి. కాని దురదృష్టవశాత్తు దేశ విభజన; తదనంతరం పాకిస్థాన్‌తో ఘర్షణలు, చైనాతో గొడవలు, ఆ తరవాతా పాకిస్థాన్‌తో యుద్ధాలు అనివార్యమయ్యాయి. దాంతో దేశం దృష్టిని అభివృద్ధి నుంచి రక్షణవైపు మళ్ళించవలసివచ్చింది.

చివరికి ప్రశాంత వాతావరణం నెలకొనడంతో ప్రగతి పథంలో సాగడం మొదలు పెట్టాం. అయినా అంతర్గత అసంతృప్తులు, ఘర్షణలు, ప్రాంతీయ ఉన్మాదాలు, అవాంఛనీయ సంఘటనలు తరచూ చోటు చేసుకుంటూనే ఉన్నాయి. వీటితో పాటు అడపాదడపా ప్రకృతి బీభత్సాలు విరుచుకు పడుతున్నాయి. ఒక విధంగా అవి కూడా స్వయంకృతాపరాధాలే!

వివిధరంగాల్లో అభివృద్ధి ప్రస్ఫుటంగా కనిపిస్తున్నప్పటికీ, అభివృద్ధి ఫలాలు అందరికీ అందడం లేదన్న విమర్శ బలంగా వినిపిస్తున్నది.

ఇలాంటి లోపాలను సరిదిద్దుకుని, అవాంతరాలను అధిగమించి, స్వాతంత్ర్య యోధులు కలలుగన్న 'సంపూర్ణ స్వరాజ్యాన్ని' సాకారం చేయడం ఎలా? అందుకు ప్రతి ఒక్కరం ఆత్మ పరిశీలన చేసుకోవాలి. స్వాతంత్ర్య పోరాట కాలంనాటి దేశభక్తి ప్రతి హృదయంలోనూ పునరుజ్జీవం పొంది ప్రజ్వలించాలి. స్వాతంత్ర్యం కోసం తమ జీవితాలను సమర్పించిన త్యాగధనుల నుంచి స్ఫూర్తిని పొందాలి. అదే మనం వారికి ఘటించే అసలైన కృతజ్ఞతాంజలి. అవకాశాలను అందిపుచ్చుకుని అభ్యుదయ పథంలో ముందుకు సాగుతూ, వెనక వస్తున్న వారికి సైతం చేయూతనివ్వాలి. అదే స్వాతంత్ర్య వజ్రోత్సవ సందర్భంగా మన వజ్రసంకల్పం కావాలి!

సంపాదకుడు : **విశ్వం**







చందమామ

చందా

ఎయిర్‌మెయిల్‌ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా
రూ.150.00
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్
ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్'
పేరిట పంపండి.

**ఉత్తమ లేఖకు బహుమతి!**
సెప్టెంబర్ సంచిక నుంచి 'పాఠకుల లేఖలు' శీర్షికలో ప్రచురించబడే ఉత్తమ లేఖకు రూ. 250/- బహుమతి అందజేస్తున్నాం. చందమామలో వెలువడే కథలు, శీర్షికల గురించి పాఠకుల నిర్మాణాత్మక విమర్శలనూ, విలువైన సలహాలనూ ఆహ్వానిస్తున్నాం. -సం.

**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
**to**
**Subscription Division**
**CHANDAMAMA INDIA LIMITED**
**82, Defence Officers Colony**
**Ekkatuthangal,**
**Chennai - 600 032**
**E-mail :**
**subscription@chandamama.org**



# పాఠకుల లేఖలు

జన్మదిన సంచిక కవర్ పేజీ చాలా ఆకర్షణీయం. మీరు ఉచితంగా పంపిన ''బటర్ స్కాచ్'' చాక్లెట్లు ఎంత తియ్యగా ఉన్నాయో అందులోని కథలు కూడా చదువుతూంటే అదే అనుభూతి పొందాము. నాకు నచ్చిన కథ-1లో కలాంగారి ''ప్రాణాన్ని కాపాడిన నిజం'' నిజంగా హైలైట్. ఇలాంటి కథను ప్రచురించినందుకు మీకు కృతజ్ఞతలు.

-పులిజాలి రవీందర్‌రావు, హైదరాబాద్

'చందమామ' అరవై ఏళ్ళు పూర్తి చేసుకున్న శుభసందర్భంలో ఎక్కువ పేజీలతో చూడ చక్కనైన ప్రత్యేక సంచికను అందించినందుకు అభినందనలు. మొదటి సంచిక విశేషాలు వివరించి-నా వద్ద లేని-ఆ సంచికపై మోజు పెంచేరు. ఉత్తమమైన పాత కథలతో సిడిలు, డివిడిలు కాదు మాకు కావలసింది. అన్ని పాత సంచికలూ పూర్తిగా-సిడిలు, డివిడిల రూపంలో వెలువరిస్తే మహదానందపడిపోయే నాలాంటి పాఠకులు కోకొల్లలు.

- కోనే నాగ వెంకట ఆంజనేయులు, విశాఖపట్నం

ఆంధ్రుల ప్రియ పత్రిక 'చందమామ'. నాకు చదవడం వచ్చిన ప్పటినుంచీ 'చందమామ' చదివి ఆనందిస్తున్నాను. ఇందులోని కథలు ఆసక్తిదాయకంగా, రంగురంగుల బొమ్మల హంగులతో, ఎన్నో మంచి విషయాలను చిన్న కథల రూపంలో, ప్రబోధాత్మకంగా ఉండి అలరిస్తాయి. శ్రద్ధగా చదివితే తప్ప ఈ కథలు అంత తేలికగా అర్థం కావు. అంతా చదివేశాక కూడా 'చందమామ'ను వదిలి ఉండలేము. - యం. వి.రమణ కుమారి, హైదరాబాద్

జూలై 2007 కవర్ పేజీ వెనుక మీరు తెలిపినట్టుగా కథల సంకలనాలలో మీరు ప్రచురించిన జానపద, సీరియల్ కథలు పుస్తక రూపంలో ప్రచురింప కోరిక. తోకచుక్క, శిథిలాలయం, రాతి రథం, దుర్గేశనందిని మొ. జానపద సీరియల్స్, మాయదారి ముసలిది, పరోపకారి పాపన్న కథలు వంటివి 'చందమామ' 60 సం.లు పూర్తి చేసుకున్న సందర్భంగా పుస్తక రూపంలో ప్రచురించినచో ఎంతో మంది కొనగలరు. పై సీరియల్స్ డివిడి రూపంలో అందించే ప్రయత్నం చేసినచో ఇంకా బాగుండును.

-రవిశంకర్, బెంగళూరు-54



# వైజయంతి నిర్ణయం

వినుకొండరాజు నరేంద్రుడి ఏకైక కుమార్తె వైజయంతి. బాల్యంలోనే తల్లిని కోల్పోయిన ఆమెను తండ్రి అల్లారుముద్దుగా పెంచి, రాజోచితవిద్యలు నేర్పించాడు. యుక్తవయస్కురాలైన వైజయంతిని చక్కని రాజకుమారుడికిచ్చి త్వరలో వివాహం జరిపించే ఆలోచనలో ఉన్నాడు నరేంద్రుడు.

వైజయంతి ఒకనాడు తన చెలికత్తెలతో కలిసి తూరుపు కొండమీది రాజేశ్వరీదేవి ఆలయానికివెళ్ళింది. చెలికత్తెలు బయటవేచి ఉండగా ఆమె మాత్రం లోపలి ఆలయంలో దేవీ దర్శనం ముగించుకుని, గుడి వెనుక వైపుకు యథాలాపంగా వచ్చింది.

అక్కడ ఒక యువకుడు బండరాయి మీద నర్తకి శిల్పం చెక్కుతున్నాడు. యువరాణి ఆ శిల్పాన్నీ, దాన్ని తదేకంగా చెక్కుతున్న శిల్పినీ చూసి సంతోషించి, ''అద్భుతం! శిల్పం చాలా అందంగా ఉన్నది,'' అంటూ శిల్పిని సమీపించింది.

ఆ మాటకు యువకుడు తలెత్తి చూశాడు ఎవరా అన్నట్టు.

''నేను యువరాణి వైజయంతిని,'' అన్నది యువరాణి.

''నమస్కారం యువరాణీ! నా పేరు విశాలుడు,'' అన్నాడు యువశిల్పి వినయంగా.

''నీ శిల్పనైపుణ్యం అత్యద్భుతం. నీతో నా శిల్పం చెక్కించుకోవాలనుకుంటున్నాను,'' అన్నది వైజయంతి.

''ఆ అవకాశాన్ని గొప్ప వరంగా భావిస్తున్నాను. పాలరాతితో మీ సుందర శిల్పం చెక్కుతాను. నెలరోజులు పట్టవచ్చు. అందుకు వారానికి ఒకసారి ఒక గంటసేపు మీరు నా ఎదుట నిలబడవలసివుంటుంది,'' అన్నాడు విశాలుడు.

మాచిరాజు కామేశ్వరరావు



''మరి ఆలస్యం దేనికి? త్వరలోనే ప్రారం భించు. అయితే, శిల్పం పూర్తయ్యేంత వరకు ఈ విషయం రహస్యంగా ఉండాలి,'' అన్నది వైజయంతి ఉత్సాహంగా.

విశాలుడు కొండకు దిగువన కొబ్బరి చెట్ల మధ్యవున్న ఒక పెంకుటిల్లును చూపిస్తూ, ''అదే మా ఇల్లు. మా అవ్వ నాతో పాటే ఉంటుంది. శిల్పం విషయం రహస్యంగా ఉండాలంటున్నారు. మరి, మీరు మా ఇంటికి రాగలరా?'' అని అడిగాడు.

''ప్రతి శుక్రవారం రాజేశ్వరీదేవీ ఆలయా నికి వస్తాను. దర్శనం ముగించి, కొండదిగి మీ ఇంటికి వస్తాను,'' అని చెప్పి వెళ్ళింది వైజ యంతి.

మరుసటి శుక్రవారం వైజయంతి, దేవిని దర్శించుకుని కొండదిగి విశాలుడి ఇంటిని సమీపించింది. చెట్ల మధ్య ఒక తిన్నె మీద పాలరాతిని అమరుస్తున్న విశాలుడు, ''రండి, మీ కోసమే ఎదురు చూస్తున్నాను,'' అని యువరాణిని గౌరవంతో ఆహ్వానించాడు.

ఆ తరవాత వైజయంతి విశాలుడు చెప్పి నట్టుగా పక్కనే వున్న ఒక చెట్టును ఆనుకుని మాధవీలతను సవరిస్తూ నిలబడింది. ఏకాగ్ర తతో విశాలుడు పాలరాతిపై ఆమె రేఖా చిత్రాన్ని చిత్రించాడు.

విశాలుడు, ''చాలు. ఇక ఇలా వచ్చి కూర్చోండి,'' అంటూండగా, ఇంటి లోపలి నుంచి అవ్వ అరిటాకులో వేడి వేడి అరిసెలు తీసుకువచ్చి ఇచ్చింది. వైజయంతి అరిసె లను ఏనాడూ తినలేదు. వాటి రుచి బాగా నచ్చి, వాటి పేరు అడిగి తెలుసుకుని, ''ఇక మీదట నిన్ను 'అరిసెల అవ్వా,' అని పిలు స్తాను. సరేనా?'' అన్నది వైజయంతి నవ్వుతూ.

''మాలాంటి పేదల ఇంటికి రావడమే కాకుండా, వరస కూడా కలిపావు. నువ్వు నూరేళ్ళు చల్లగా ఉండాలి తల్లీ,'' అంటూ చేతులు జోడించింది అవ్వ.

విశాలుడు ప్రత్యేక శ్రద్ధ కనబరచడం వల్ల మూడు వారాలలోనే శిల్పం దాదాపు పూర్త యింది. ఒకరోజు సాయంకాలం దానిని చూడడానికి వచ్చిన వైజయంతితో, ''ఇక తుది మెరుగులు మాత్రమే దిద్దవలసి ఉన్నది. మరో నాలుగురోజుల్లో మీరు శిల్పాన్ని తీసుకు వెళ్ళవచ్చు,'' అన్నాడు విశాలుడు.

వైజయంతి తన శిల్పాన్ని తనివితీర చూసుకుని సంతోషంగా వెనుదిరిగింది.

మరునాటి ఉదయం ఉద్యానవనంలో తిరుగుతూన్న వైజయంతి, నిండుగా పూచిన గులాబీని అందుకోబోతూ, ''మీ సౌందర్యం అపూర్వం, యువరాణీ!'' అన్న మాటలు వినిపించి తలెత్తి చూసింది. ఆమెకు కొద్ది దూరంలో ఒక క్షత్రియ యువకుడు కనిపించాడు. దేశాటనలో వున్న కొండవీటి యువరాజు జయంతుడు ఆరోజు తమ అతిథిగా వస్తున్నాడని క్రితం రాత్రి తండ్రి చెప్పడం గుర్తుకు వచ్చింది వైజయంతికి.

''మీరు మా అతిథిగా రావడం మాకెంతో సంతోషం కలిగించింది,'' అంటూ వైజయంతి దూరంగా ఉన్న తోటమాలిని పిలిచి, జయంతుడికి ఉద్యాన వనమంతా చూపించమని చెప్పి, తన అంతఃపురంలోకి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి నరేంద్రుడు వైజయంతితో, ''అమ్మా, నువ్వు జయంతుడికి ఎంతగానో నచ్చావట. నిన్ను చూసిన క్షణమే నిన్నే వివాహమాడాలని నిశ్చయించి, నిన్ను చూడడానికి త్వరలో తన తల్లిదండ్రులను పంపుతానన్నాడు. నీ అభిప్రాయం ఏమిటి తల్లీ,'' అన్నాడు.

''జీవితంలో వివాహం చాలా ముఖ్యమైనది కదా? నన్ను కాస్త ఆలోచించుకోనివ్వండి, నాన్నా,'' అన్నది వైజయంతి.

మరునాడు తెల్లవారక ముందే ఒక చెలికత్తె వచ్చి, ''కోట గుమ్మం దగ్గర ఒక ముసలిసిది మీ దర్శనార్థం వేచి ఉన్నది. అరిసెల అవ్వ అట!'' అన్నది వైజయంతితో.



''లోపలికి తీసుకురా,'' అని ఆజ్ఞాపించిన వైజయంతి, ఆమె రాగానే, తన ఆంతరంగిక మందిరంలోకి తీసుకుపోయి, ''ఆ కన్నీళ్ళేమిటి, అవ్వా? అసలు ఏం జరిగింది?'' అని అడిగింది ఆందోళనతో.

అవ్వ ఆ క్రితం సాయంత్రం తమ ఇంట జరిగిన విషయం పూసగుచ్చినట్టు వివరించింది:

కొండవీటి యువరాజు జయంతుడు తన పరివారంతో తిరిగి వెళుతూ మంచి నీళ్ళ కోసం విశాలుడి ఇంటి ముందు ఆగాడు. విశాలుడి అవ్వ అందరికీ తాగడానికి మజ్జిగ ఇచ్చింది. బయలుదేరే ముందు జయంతుడు, ''ఇదేమిటి?'' అంటూ వైజయంతి పాలరాతి శిల్పం మీది వస్త్రాన్ని, తన కత్తితో పక్కకు తొలగించాడు.



అతిమనోహరంగా ఉన్న వైజయంతి శిల్పాన్ని చూడగానే జయంతుడు ఆగ్రహోదగ్రుడై, ''ఈ జయంతుడికి కాబోయే భార్య శిల్పాన్ని ఇక్కడ ఉంచుకోవడానికి ఎంత ధైర్యం? నా హృదయపీఠంపై కొలువుండే యువరాణి శిల్పాన్ని ఇక్కడ నిలబెట్టిన ద్రోహి ఎవరు?'' అని గద్దించి అడిగాడు.

''ఆ శిల్పాన్ని నేనే చెక్కాను,'' అన్నాడు విశాలుడు వినయంగా.

''ఎలా చెక్కావు? యువరాణిని ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు చూశావు?'' అని నిల దీశాడు జయంతుడు.

విశాలుడు బదులు పలకకుండా మౌనం వహించాడు.

జయంతుడు తల తిప్పి తన అంగరక్షకుడి కేసి చూశాడు. మరుక్షణమే వాడు విశాలుణ్ణి ఎడాపెడా కొరడాతో కొట్టసాగాడు. కాని అతడు మాత్రం నోరు విప్పలేదు. జయంతుడు పట్టరాని ఆగ్రహంతో, శిల్పాన్ని కింద పడదోసి ముక్కలుగా విరగకొట్టి, ''ఈ దుర్మార్గుణ్ణి అన్న పానీయాలు లేకుండా వీడి ఇంట్లోనే బంధించండి,'' అని ఆజ్ఞాపించి ఇద్దరు భటులను కాపలా ఏర్పాటు చేశాడు. కాళ్ళ మీద పడి అవ్వ ఎంత వేడుకున్నా పట్టించుకోకుండా కాలితోనే ఆమెను పక్కకు తోసి గుర్రం ఎక్కి వెళ్ళిపోయాడు.

''నిన్న సాయంకాలం నుంచి వాడు పచ్చి నీళ్ళు కూడా ముట్టుకోలేదు. మీరే వాణ్ణి కాపాడాలి,'' అంటూ వైజయంతికి చేతులెత్తి మొక్కింది అవ్వ.

ఆమె మాటలను విన్న వైజయంతి, ''నువ్వేమీ భయపడకు. విశాలుడికి ఎలాంటి ఆపదా రాదు,'' అంటూండగా రాజు వైజయంతిని చూడడానికి అక్కడికి వచ్చాడు.

వైజయంతి తండ్రికి జరిగినదంతా వివరించి, ''మీకు తెలియకుండా నా శిల్పం చెక్కించుకున్నందుకు నన్ను క్షమించండి. జన్మదిన కానుకగా మీకు ఇచ్చి సంభ్రమం కలిగించాలని ఆ విషయం గోప్యంగా ఉంచాను. నా శిలావిగ్రహం వేరొక చోట ఉండడం చూసి అది అక్కడ ఎందుకు ఉందన్న పూర్వాపరాలు తెలుసుకోకుండా ఆగ్రహం చెంది తన రాజ్యానికి చెందని ఒక నిరపరాధిని కఠినంగా శిక్షించాడు జయంతుడు. అతని ప్రవర్తన నా పట్ల ప్రేమకన్నా, నేను అతనికే దక్కాలన్న మితి మించిన

స్వార్థం, అహంకారాలను తెలియజేస్తున్నది. ఇక విశాలుడు శిల్పం చెక్కే విషయం రహస్యంగా ఉంచాలని చెప్పిన నా మీది గౌరవం కొద్దీ ప్రాణం మీదికి వచ్చినా పెదవి విప్ప లేదు. మాట తప్పని గుణం, ఓర్పు, నేర్పు, శ్రద్ధ, శాంతం ఏపాలకుడికైనా ఉండవలసిన ముఖ్య లక్షణాలు. అవన్నీ విశాలుడిలో ఉన్నాయి. నేను జయంతుణ్ణి వివాహమాడితే మన రాజ్యం కొండవీటిలో కలిసిపోయి, తన అస్తిత్వాన్ని కోల్పోతుంది. విశాలుణ్ణి చేసుకుంటే వినుకొండ రాజ్యం సుస్థిరంగా ఉంటుంది. అందువల్ల మీరు అనుమతిస్తే విశాలుణ్ణి వివాహమాడదలిచాను,'' అన్నది.

అంతా విన్న నరేంద్రుడు తలపంకిస్తూ, ''తీరా ఆలోచించాకే నువ్వు ఏ నిర్ణయమైనా తీసుకుంటావని నాకు తెలుసు. అయినా, ఆలోచించడానికి నాకూ కొంత సమయం కావాలి,'' అన్నాడు.

అక్కడే నిలబడివున్న అవ్వ, ''ఇన్నాళ్ళు నా కడుపులో దాచుకున్న ఒక రహస్యం చెప్పవలసిన సమయం వచ్చిందనుకుంటాను. విశాలుడు నా సొంత మనవడు కాదు. గుర్రంకొండ రాజును దాయాదులు కుట్రతో హతమారిస్తే, రాణిగారు ఆరునెలల పసిబిడ్డను నా కప్పగించి కన్నుమూసింది. శత్రువుల నుంచి అతడికి ఎలాంటి ఆపదా రాకూడదని రాణిగారికిచ్చిన మాట కారణంగా, ఆ రాజ్యం వదిలి వచ్చినా, ఇన్నాళ్ళు ఆ రహస్యాన్ని విశాలుడికి కూడా చెప్పలేదు. ఇకపై అతడి రక్షణాభారం మీదే,'' అన్నది అవ్వ.

''ఏమిటీ! విశాలుడు గురుకులంలో నా సహాధ్యాయి అయిన గుర్రంకొండ రాజు భూపాలుడి కుమారుడా?'' అంటూ సంభ్రమాశ్చర్యాలకు లోనైన రాజు, కుమార్తెకేసి తిరిగి, 'వైజయంతీ, ఎంత మంచివాడైనప్పటికీ, ఒక సామాన్య శిల్పికిచ్చి వివాహం చేయడమా అన్న సందిగ్ధంలో పడి వెనుకాడాను. ఇప్పుడతడు సకల సద్గుణ సంపన్నుడైన నా బాల్యమిత్రుడి కుమారుడని తెలిసిపోయింది. ఇంకేం. నిరభ్యంతరంగా నీకు నచ్చిన విశాలుణ్ణి పరిణయమాడవచ్చు,'' అన్నాడు.

వైజయంతి ఆప్యాయంగా తండ్రిని చూస్తూ మందహాసం చేసింది.



# సమయపాలన!

సుప్రసిద్ధ పండితుడు రాధామనోహరుడికి ఆరోజు సాయంకాలం పారుపల్లి జమీందారు అధ్యక్షతలో సన్మానం. ఆయన సభికులకు సందేశాత్మకమైన కవితను వినిపించాలని తీవ్రంగా ఆలోచించాడు. 'సూర్యోదయం-అస్తమయం, పగలు-రేయి, పౌర్ణమి-అమావాస్య, ఎండలు-వానలు అన్నీ నిర్ణీత సమయంలోనే వస్తాయి. ప్రకృతిలో ప్రతి అణువూ సమయపాలన పాటిస్తుంది. మనుషులను జంతుజాలం నుంచి వేరు చేసేది క్రమశిక్షణ. క్రమశిక్షణకు తొలి అడుగు, తుది అడుగు సమయపాలన. ప్రగతిని కోరే ప్రతి మనిషికీ సమయపాలన శ్వాసకావాలి'—అని అర్థం వచ్చేలా ఒకపద్యం రచించి పదేపదే రాగయుక్తంగా మననం చేయసాగాడు.

ఆరోజు మధ్యాహ్నం జమీందారు ఇంట సుష్టుగా భోజనం చేసి కాస్త ఎక్కువ సేపు నిద్రపోవడంతో సన్మాన సభకు కొద్దిగా ఆలస్యంగా బయలుదేరవలసివచ్చింది. కొంతదూరం వెళ్ళేసరికి గుర్రబ్బండి వేగం పెరిగింది. ఆ వేగానికి తట్టుకోలేక బండివేగం కాస్త తగ్గించమన్నాడు పండితుడు.

''సభకు ఇప్పటికే ఆలస్యమయింది. ఇంకా చాలా దూరం వెళ్ళాలి,'' అన్నాడు బండి తోలేవాడు.

''సభకు పదినిమిషాలు ఆలస్యమవుతుంది కదా అని, పది సంవత్సరాలు ముందుగానే వెళ్ళిపోవడం భావ్యం కాదు కదా!'' అన్నాడు పండితుడు.

ఆ మాటకు బండివాడు చిన్నగా నవ్వి, బండివేగాన్ని తగ్గించాడు.






# రాకాసిలోయ

## 24

[కేశవుడూ, అతడి అనుచరులూ కొండ గుహల్లో నివసించే జాతివాళ్ళకు, రెక్కల మనుషుల నుంచి రక్షణ కల్పిస్తామని, వాగ్దానం చేశారు. తరవాత రాత్రివేళ ఇద్దరు గుహావాసులను; తమ దేవతకు బలి ఇచ్చేందుకు ఎత్తుకుపో ప్రయత్నిస్తున్న రెక్కల మనుషుల మీదికి, కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్ మాటువేసి చాటున నిలబడి బాణాలు ఎక్కుపెట్టి వదిలారు. -తరవాత]

కేశవుడూ వాళ్ళు వదిలిన బాణాలు గురి తప్పి జుయ్ మంటూ పెద్ద శబ్దం చేస్తూ పోయి బలంగా చెట్ల కొమ్మలను తాకినై. ఆ ధ్వని వింటూనే రెక్కల మనుషులు కిందికి దూకే వాళ్ళల్లా, గాలిలో ఆగి, ''మోసం, నమ్మక ద్రోహం!'' అంటూ అరిచి, దూరంగా వున్న చెట్ల చాటుకు ఎగిరిపోయారు.

''ఆ దుర్మార్గులు, మన బాణం వేటు నుంచి చాలా దూరం పారిపోయారు. ఇప్పుడే మిటి చేయటం?'' అన్నాడు కేశవుడు.

జయమల్లు పొదలచాటు నుంచి లేచి నిల బడుతూ, ''వాళ్ళు ఎంతో దూరం ఎగిరిపోయి వుండరని, నా నమ్మకం. వెతుకుదాం, రండి!'' అంటూ బయలుదేరాడు. అంతలో ప్రాణా పాయం నుంచి బయటపడిన గుహావాసు లిద్దరూ అక్కడికిపరిగెత్తుకుని వచ్చి, ''అయ్యా, ఆ రెక్కల మనుషులు ఆకాశంలోకి ఎగిరి పోయారు. కాని, అంతకన్న దుర్మార్గులైన శ్వానకర్ణి ముఠావాళ్ళు మనకేసి వస్తున్నారు. మనం ప్రాణాలతో పారిపోలేం,'' అన్నారు.

'చందమామ'



శ్వానకర్ణి అన్నపేరు వింటూనే జయమల్లు ఆశ్చర్యపడి, ''ఎవడా శ్వానకర్ణి? పేరు వింతగా వుందే! వాడి ముఠావాళ్ళు మన మీదికి ఎటు నుంచి దాడి చేసేందుకు వస్తున్నారు?'' అని అడిగాడు.

గుహావాసులు జవాబు చెప్పే లోపలే, కోయగోమాంగ్ పక్కకు తిరిగి చూస్తూ, ''అవిగో కాగడాలు! ఒక మందకు మంద మన కేసి వస్తున్నారు,'' అంటూ బాణం ఎక్కుపెట్టాడు. జయమల్లూ, కేశవుడూ అతడు చెప్పిన వైపుకు చూశారు. గుహావాసుల్లాగే వున్న చాలామంది అడవి మనుషులు, ఈటెలు పట్టుకుని, కాగడాలు ఊపుతూ నిశ్శబ్దంగా తమ కేసి రావటం వాళ్ళకు కనిపించింది.

జయమల్లు బాణం ఎక్కుపెట్టి వాళ్ళ కేసి కొంత దూరం నడిచి ఆగి, ''మీరెవరో మాకు తెలియదు. మీకూ మాకూ ఎలాంటి శత్రుత్వం లేదు. మీ దారిన మీరు పొండి. అలా చేయక పోయారో, మీకు మా చేతుల్లో చావు తప్పదు,'' అన్నాడు. కేశవుడూ, కోయగోమాంగ్ కూడా బాణాలు ఎక్కుపెట్టి, అతడి పక్కన నిలబడ్డారు. గుహావాసు లిద్దరూ వాళ్ళ వెనక దాక్కున్నారు.

కాగడాల వెలుగులో ముందు నడుస్తున్న ఒక అడవి మనిషి, చేతిలోని ఈటెను పైకెత్తి, ''మీకూ మాకూ శత్రుత్వం లేని మాట నిజం. మీ దారిన మీరు పొండి. మీ జోలికి మేము రాము. మాక్కావలసిందల్లా, మీ వెంట వున్న, బిడాలి ముఠావాళ్ళు. వాళ్ళిద్దర్నీ మాకు ఒప్పగించండి,'' అన్నాడు.

ఎవరీ బిడాలి? అన్న అనుమానం జయమల్లునూ, అతడి తోటి వాళ్ళనూ ఆశ్చర్యపరిచింది. శ్వానకర్ణి, బిడాలి-ఎవరు వీళ్ళు? ఎందుకు వీళ్ళ మధ్య శత్రుత్వం?

''అయ్యా, బిడాలి మా నాయకుడు. ఇవ్వాళ ఉదయం వేళ ఆయన్ని మీరు చూశారు. మాలాగే ఈ శ్వానకర్ణి ముఠావాళ్ళు కూడా కొండ గుహల్లో నివసించే జాతివాళ్ళే. అయినా, వాళ్ళకూ మాకూ బద్ధవైరం. వాళ్ళకు మమ్మల్ని ఒప్ప చెప్పారో నిలువునా కోసి చంపేస్తారు,'' అన్నాడొక గుహావాసుడు వణికిపోతూ.

''జయమల్లూ! మనం వీళ్ళను రక్షిస్తామని మాట ఇచ్చాం. ఏమైనా సరే, ఆ మాట నిలబెట్టుకోవలసిందే,'' అన్నాడు కేశవుడు. కోయగోమాంగ్ తలాడించి, వింటి తాడు బలంగా లాగబోయాడు.

జయమల్లు అతణ్ణి వారిస్తూ, ''కేశవా! మనం చేసిన వాగ్దానం నిలబెట్టుకోలేనంత పిరికిపందలం కాదు. కాని, ఇప్పుడు ఎదురైన పరిస్థితి చూశావా? మన విరోధులు నలభై యాభై మంది వరకూ వున్నారు. మనం వాళ్ళం దర్నీ చంపి పారిపోగలగటం సాధ్యమయ్యేది కాదు,'' అన్నాడు.

''అయితే, ఏమిటి నీ ఆలోచన?'' అన్నాడు కేశవుడు అనుమానంగా.

''రాజీ మాటలతో వాళ్ళను ముందుకు రాకుండా ఆపుదాం. అలా సాధ్యం కాకపోతే, అన్నిటికీ తెగించి పోరాటం చేద్దాం,'' అంటూ జయమల్లు ముందుకు రెండడుగులు వేసి, ''ఇప్పుడు మాట్లాడింది శ్వానకర్ణియేనా? అలా అయితే, ఈటె అవతల పారేసి, ఒక్కడూ ముందుకు రాకోరతాను. ఇదుగో, నా విల్లంబులు వదిలేశాను,'' అంటూ తన విల్లంబులను కింద పడవేశాడు.

''శ్వానకర్ణి మా నాయకుడు. ఆయన గుహదగ్గరే వున్నాడు. నేనాయన అనుచరుణ్ణి. కాలయాపనెందుకు? ఆ బిడాలి ముఠా వాళ్ళిద్దర్నీ వదిలి, మీ దారిన మీరు పొండి,'' అన్నాడు శ్వానకర్ణి అనుచరుడు.

''అలా ఎన్నటికీ జరగదు. వాళ్ళిద్దర్నీ మీరు పట్టుకోవాలంటే, ముందు మాతో యుద్ధం చేయాలి. అందుకు తయారయ్యారో, మీలో ఒక్కడూ బతకడు. మా బాణాల దెబ్బ మీకు తెలియదేమో? ఇంతకు ముందే ఇద్దరు రెక్కల మనుషుల్ని చెట్ల మీంచి కింద పడేలా కొట్టాం,'' అంటూ జయమల్లు బాణం ఎక్కుపెట్టాడు.




ముగ్గురూ విల్లంబులతో ముందుకు నాలు గడుగులు వేసేసరికి, శ్వానకర్ణి అనుచరుడు వెనుదిరిగి, తన ముఠావాళ్ళతో ఏదో అన్నాడు. వెంటనే అందరూ అతడి చుట్టూ గుంపుగా చేరి గడబిడగా మాట్లాడుకోసాగారు.

''కేశవా! ఆ గొడవ చూశావా? మన మీద దాడిచెయ్యటమా? మానటమా? అన్న సమస్య తేలక వాళ్ళల్లోవాళ్ళే తన్నుకునేట్టున్నారు. ఇదే మంచి అదను. ఒక పేచీ వేసి చూస్తాను,'' అంటూ జయమల్లు అడవి మనుషుల కేసి తిరిగి, ''మీలో చావదలుచుకున్నవాళ్ళంతా ఒక్కొక్కరుగా ఇలా ముందుకు రండి, తతిమ్మా వాళ్ళు వెనక్కు తిరిగి పొండి. మీ నాయకుడు శ్వానకర్ణి ఈ సమయంలో ఇక్కడ వుంటే, మాతో స్నేహానికి తప్పక ప్రయత్నించేవాడు. మీరు వట్టి మందమతుల్లా వున్నారు,'' అన్నాడు.



జయమల్లు ఇలా అనగానే, శ్వానకర్ణి అనుచరుణ్ణని చెప్పుకున్నవాడు తోటివాళ్ళను పెద్దగా కసురుకుని, జయమల్లు కేసి రెండడుగులు నడిచి, ''మీరు కావాలంటే మా నాయకుడితో స్వయంగా మాట్లాడ వచ్చు. భయం లేకపోతే, మా వెంట రండి, ఆయన వుండే గుహకు తీసుకుపోతాం,'' అన్నాడు.

భయం అన్న మాట వింటూనే కేశవుడికి ఎక్కడలేని పౌరుషం వచ్చింది. వాడు వింటి తాడును గట్టిగా లాగి మోగిస్తూ, ''మేము కావాలంటే మీ నాయకుడి దగ్గరకే కాదు, అతడి ముత్తాత దగ్గరకైనా వస్తాం, నడవండి,'' అన్నాడు తీవ్రంగా.

జయమల్లుకు, కేశవుడు అనాలోచితంగా మాట జారాడేమో అన్న భయం కలిగింది. కాని, ఇప్పుడు అన్న మాట మీద నిలవక తప్పదు. మాట తప్పితే, తాము భయపడుతున్నామనుకుని, ఆటవికులు ఒక్కుమ్మడిగా మీద పడవచ్చు...

జయమల్లు ఇలా ఆలోచిస్తూనే వెనుదిరిగి, వెనక నిలబడి వున్న గుహావాసుల్లో ఒకడికి, అక్కణ్ణించి పారిపోయి, జరిగిన సంగతేమిటో వాళ్ళ నాయకుడైన బిడాలికి చెప్పమన్నాడు. రెండవవాణ్ణి తమ వెంటే వుండమన్నాడు. అంతలో శ్వానకర్ణి అనుచరుడు పెద్దగా గొంతెత్తి, ''మీ రన్నదే అన్ని విధాలా బావుంది. మా వెంట రండి. మా నాయకుడితో మాట్లాడుదురు గాని. ఆయన మిమ్మల్ని మీ దారిన పొమ్మంటే పోవచ్చు. అనవసరంగా మీరూ మేమూ, ఆ బిడాలి ముఠా వెధవలిద్దరి కోసం ఇక్కడ కొట్టుకు చావట మెందుకు?'' అన్నాడు.

''సరే, మీరు ముందు నడవండి. మీ గుహలుండే చోటు చేరేవరకూ, మీకూ మాకూ ఇప్పుడున్న దూరమే వుండాలి. ఏదైనా మోసం చేయచూస్తే, మీలో ఒక్కడు కూడా బతకడు,'' అన్నాడు జయమల్లు.

ఆ తరవాత అంతా ముందుకు కదిలారు. ఒక అరగంట కాలం ప్రయాణం చేసి ఎత్తయిన కొండలు గల ఒకానొక ప్రాంతాన్ని చేరారు. అప్పటికి తూర్పు దిక్కు కొంచెం కొంచెమే తెల్లనవుతున్నది. ఆ వెలుగులో జయమల్లుకూ, అతడి అనుచరులకూ ఎగుడు దిగుడుగా వున్న కొండలూ, వాటి అంచుల మీద నిలబడి వున్న గుహావాసులూ కనిపించారు. అందరూ ఆ ప్రదేశానికి చేరుతూ వుండగానే, పై నుంచి పెద్ద పెద్ద కొండరాళ్ళు దొర్లి, కేశవుడూ వాళ్ళకేసి రాసాగినై. అది

చూస్తూనే ముందున్న శ్వానకర్ణి అనుచరులు కేకలు పెడుతూ కొండ మీదికి పరిగెత్తారు.

ముందు నడుస్తున్న జయమల్లు చటుక్కున ఆగి, ''గోమాంగ్! అదిగో, ఆ కుడి వైపున వున్న బండ మీద ఎలుగుచర్మం కప్పుకుని నిలబడి వున్నవాడే శ్వానకర్ణి అయివుంటాడు. వాడికి బాణం గురిచేసి పెట్టు. కాని, నేను వదలమనేవరకూ వదలవొద్దు,'' అని చెప్పి, ముందుకు రెండడుగులు వేసి, ''శ్వానకర్ణీ! మీరేదో నమ్మక ద్రోహం తలపెట్టినట్టున్నది. అలా అయితే ముందు చావనున్నది, నువ్వు! చూశావా? నీ గుండెలకు బాణం ఎక్కుపెట్టి వున్నది. పారిపోయేందుకు ప్రయత్నించావో, బాణం నీ గుండెలలో నుంచి దూసుకుపోతుంది,'' అని కఠినంగా హెచ్చరించాడు.

జయమల్లు హెచ్చరిక పూర్తయ్యే లోపలే శ్వానకర్ణి ముఠావాళ్ళు వాళ్ళ మీదికి కొండ రాళ్ళు దొర్లించటం ఆపేశారు. అంతలో శ్వానకర్ణి అనుచరుడు, తమ నాయకుణ్ణి సమీపించి, జయమల్లూ వాళ్ళను చూపుతూ ఏమో చెప్పాడు. నాయకుడు అటూ ఇటూ రెండు మూడుసార్లు తలాడించి, జయమల్లు కేసి తిరిగి పెద్ద గొంతుతో, ''మీరు మా శత్రువులకు మిత్రులు, కనక–మాకు శత్రువులు. మీరు మా నుంచి ప్రాణాలతో పారిపోలేరు,'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే కేశవుడు విల్లు పైకెత్తి, ''ఊ, మల్లూ! ఇక లాభం లేదు. ఆ శ్వానకర్ణినీ మరి కొందర్నీ కొట్టి పారిపోదాం. బాణం ఎక్కుపెట్టు,'' అన్నాడు.




జయమల్లు, కేశవుణ్ణి తొందర పడవద్దని వారించి, ''కేశవా! మనం ఈ ప్రాంతాలకు కొత్తవాళ్ళం. ఇక్కడ నివసించే అడవిజాతి వాళ్ళందరితో వైరం పెట్టుకుని ఎక్కడికి పారిపోగలం? మనం పుట్టి పెరిగిన రాజ్యం వదిలినది మొదలు దారి పొడుగునా ప్రతి వాళ్ళతో విరోధం తప్ప, ఒక్కళ్ళతో కూడా మనకు స్నేహం కలవలేదు. పులి మీద పుట్రలాగా, బ్రహ్మదండి మాంత్రికుడు మనను వెన్నాడే వుంటున్నాడు. మనం ఈ గుహావాసులతో మైత్రి చేయగలిగితే, వీళ్ళ నుంచి రాకాసి లోయకు వెళ్ళే మార్గం తెలుసుకునే అవకాశం కలగవచ్చు. అంతే కాక, నీ తండ్రి ఒక వేళ ఈ ప్రాంతానికి వస్తే, అతడికి వీళ్ళు సహాయపడే వీలుకూడా వుంటుంది,'' అన్నాడు.

తండ్రి పేరు వింటూనే కేశవుడు వెలవెలపోయి, విల్లంబులు దించుతూ, ''కాని,

వీళ్ళతో స్నేహం చేయటం ఎలా? వీళ్ళు పచ్చి మాంసం తినే ఆటవికులు!'' అన్నాడు.

''అదంతా నాకు వదిలెయ్యి. రెక్కల మనుషుల్నుంచి రాబోయే ప్రమాదం చూపి, ఆ బిడాలికీ, ఈ శ్వానకర్ణికీ మైత్రి కలిగించేందుకు ప్రయత్నిస్తాను. వాళ్ళూ వీళ్ళూ కూడా కొండ గుహల్లో నివసించే వాళ్ళేగదా,'' అంటూ జయమల్లు శ్వానకర్ణి కేసి తిరిగి, ''శ్వానకర్ణీ! మేం నీ బెదిరింపులకు భయపడేవాళ్ళం కాదు. బిడాలి ముఠావాళ్ళను రెక్కల మనుషుల నుంచి కాపాడతామని వాగ్దానం చేశాం. ఆ రెక్కల మనుషుల్ని పదీ పన్నెండు మందిని చంపాం కూడా. మీరూ మీరూ పోట్లాడుకుంటూ వుంటే, ఆ దుర్మార్గులు నీ ముఠా వాళ్ళను కూడా ఏదో ఒక రోజున ఎత్తుకుపోవటం మొదలు పెడతారు. ఇంతకూ-నీకూ ఆ బిడాలికీ వైరకారణం ఏమిటి?'' అని అడిగాడు.

'వైరకారణమా? ఆ బిడాలి తండా వాళ్ళంత నీచులు ఎక్కడా వుండరు. నేను గుహలో లేని సమయం చూసి, వాళ్ళు మా మూల పురుషుడి రాతి గద ఎత్తుకుపోయారు. అది ఎన్నో మహత్తర శక్తులు గలది. అది తిరిగి సంపాయించుకునేందుకు, వాళ్ళ నందర్నీ సర్వనాశనం చేయబోతున్నాను,'' అన్నాడు శ్వానకర్ణి పళ్ళు కొరుకుతూ.

''ఆ రాతి గద బిడాలి తెచ్చి నీకిచ్చేస్తే, మీ మధ్య వైరం పోయినట్టేనా?'' అని ప్రశ్నించాడు జయమల్లు.

శ్వానకర్ణి హేళనగా నవ్వుతూ, ''బిడాలి ఆ గద తెచ్చి నా కివ్వటమా? అదెలా సాధ్యం? ఆ గద కోసం వాడు ఎన్ని చావులైనా చస్తాడు; తన ముఠావాళ్ళనందర్నీ చావనిస్తాడు,'' అన్నాడు.

''బిడాలి రహస్యం నాకు తెలుసు. మీ మూలపురుషుడి రాతిగద బిడాలి చేత తెప్పించి, నీ కిప్పిస్తాను,'' అంటూ జయమల్లు, వెనక నిలబడి వున్న బిడాలి ముఠావాడి కేసి తిరిగి, ''శ్వానకర్ణి చెప్పినది అంతా విన్నావు గదా? వెంటనే వెళ్ళి, మీ నాయకుణ్ణి రాతి గద తీసుకుని ఇక్కడికి రమ్మన్నానని చెప్పు. అతడి కొచ్చిన ప్రాణభయం ఏమీ లేదు,'' అన్నాడు. బిడాలి అనుచరుడు వెంటనే బయలుదేరి వెళ్ళాడు. -(ఇంకావుంది)



# నేరంలేని నగరం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఎలాంటి నిర్ణయం తీసుకుని దానిని నెరవేర్చడానికి అర్ధరాత్రి వేళ ఇలా ఇక్కట్లు పడుతున్నావో నాకు తెలియదు. అయితే, కాలం అనుకూలించినప్పుడు సైతం ఎంతో సంయమనంతో ఆలోచించి సరైన నిర్ణయాలు తీసుకోగల వివేక సంపన్నులు కూడా, ఒక్కొక్కసారి తాము తీసుకున్న నిర్ణయాల ద్వారా తమ వారిని చిక్కుల్లోపడవేస్తూ ఉంటారు. నువ్వు అలాంటి పొరబాటు చేయకుండా తగు హెచ్చరికగా ఉండేందుకు వీలుగా మనోహరి అనే ఒక యువతి కథ చెబుతాను, శ్రమ



తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

మాతంగదేశంలో జలపురమనే చిన్న నగరంలో శమనకుడు అనే నిజాయితీపరుడైన బియ్యం వ్యాపారి ఉండేవాడు. అతనికి సుశీల అనే భార్య, మనోహరి అనే కూతురు, కౌశికుడు, చైతన్యుడు అనే కొడుకులు ఉండేవారు.

జలపురానికి కొద్ది దూరంలో ఉన్న మణిపురమనే పెద్ద నగరానికి పాలకుడు సుమంతుడు. ఆయనకు పిల్లలు లేక, దూరపు బంధువైన శమనకుడి కొడుకు చైతన్యుణ్ణి దత్తతకు అడిగాడు. బిడ్డలను ప్రాణప్రదంగా ప్రేమించే శమనకుడు, సుశీల అందుకు సమ్మతించ లేదు. సుమంతుడికి కోపం వచ్చినా బయట పడలేదు.

ఒకసారి మణిపురం రామాలయంలో శ్రీరామనవమి వేడుకలు ఘనంగా జరిగాయి. వాటిని చూడడానికి భార్యాబిడ్డలతో వచ్చిన శమనకుడికి సుమంతుడు సాదరంతో స్వాగతం పలికి, తమ ఇంట్లోనే సకల సౌకర్యాలతో బస ఏర్పాటు చేశాడు. తగిన సమయం వచ్చింది కదా అని చైతన్యుణ్ణి దత్తత ఇవ్వమని మళ్ళీ అడిగాడు. శమనకుడు ఒప్పుకోలేదు. ఆగ్రహించిన సుమంతుడు ఆ దంపతులపై అబద్ధపు దొంగతనం నేరం మోపి, రాజ్య బహిష్కార శిక్ష విధించాడు.

శమనకుడు బదరికారణ్యం చేరుకుని అక్కడొక ఆశ్రమం నిర్మించుకున్నాడు. కందమూలాలూ, పక్వఫలాలూ తింటూ ఆ దంపతులు అరణ్య జీవితానికి క్రమంగా అలవాటు పడ్డారు. పిల్లలు మాత్రం అరణ్య జీవితం నచ్చక రోజూ గొడవ చేసేవారు. ''శకుని మాయా జూదంలో ఓడిస్తే, అది అన్యాయమని తెలిసి కూడా పాండవులంతటివారు అరణ్యవాసం, అజ్ఞాతవాసం చేశారు. ఆ తరవాత కురువీరులను కురుక్షేత్ర యుద్ధంలో ఓడించి, తమ రాజ్యం సంపాదించుకున్నారు. దేనికైనా సమయం రావాలి. మంచి రోజులు వచ్చే వరకు మనం ఇక్కడే ఉండక తప్పదు,'' అని శమనకుడు పిల్లలకు నచ్చ చెప్పేవాడు.

తొమ్మిదేళ్ళు గడిచాయి. శమనకుడి పిల్లలు పెద్దవారయ్యారు. యుక్తవయస్కురాలైన మనోహరి అందచందాలు చూసి, ఆమెకు తగిన వరుణ్ణి వెదికేదెలాగా అని తల్లిదండ్రులు బెంగపడేవారు.

ఇలా ఉండగా మాతంగదేశానికి కొత్తగా రాజైన మాణిక్యవర్మ శమనకుడున్న అడవికి వేటకు వచ్చి, ఒక జింకను తరుముతూ దారి తప్పాడు. దాహం వేసి మంచి నీటి కొలను కోసం వెతుకుతూంటే ఆయనకు మనోహరి ఎదురయింది. అద్భుతమైన ఆమె అందానికి ముగ్ధుడైన మాణిక్యవర్మ దాహం సంగతి కూడా మరిచిపోయి, ''సుందరీ, నేను మాతంగ దేశపురాజు మాణిక్యవర్మను. వేటకువచ్చి దురదృష్టవశాత్తు దారి తప్పాను. ఇప్పుడు అదృష్టవశాత్తు నిన్ను చూశాను. అపురూపమైన నీ అందచందాలకు ముగ్ధుణ్ణయ్యాను. నీకు సమ్మతమైతే నిన్ను వివాహమాడతాను,'' అన్నాడు ఆమెతో.



మనోహరి సిగ్గుతో తలదించుకుని, ''రాజా, నేను తండ్రిచాటుబిడ్డను. నా అభిప్రాయం చెప్పడం భావ్యం కాదు. నా పేరు మనోహరి. మా ఆశ్రమం దగ్గరలోనే ఉన్నది. మీ కోరికను మా తండ్రికి చెప్పండి,'' అని చెప్పి, రాజును తమ ఆశ్రమానికి తీసుకువెళ్ళింది.

మాణిక్యవర్మ శమనకుడికి తన మనోభీష్టం చెప్పి, వారందరినీ తనతో రాజధానికి రమ్మన్నాడు.

శమనకుడు లోపలకు వెళ్ళి, విషయం భార్యాబిడ్డలకు చెప్పి, ''మనకు రాజ్య బహిష్కార శిక్ష ఉన్నదని తెలిస్తే, రాజు ఆ అన్యాయాన్ని సరిదిద్దుతాడో, నేరస్థుల బిడ్డ అని మనోహరితో పెళ్ళి వద్దనుకుంటాడో చెప్పలేం. ఆయన పెళ్ళి చేసుకుంటాననడం మనోహరిని వెతుక్కుంటూ వచ్చిన గొప్ప అదృష్టం. మనోహరి రాజును పెళ్ళాడి, దేశానికి మహారాణి కావాలి. ఆ తరవాత వీలు చూసుకుని సుమంతుడి గుట్టు రట్టు చేసి మన అరణ్యవాసం తప్పించాలి,'' అన్నాడు.

అందుకు మనోహరి ఒప్పుకోకుండా, ''ఇక్కడ మీరంతా ఇన్ని కష్టాలు పడుతూంటే, అక్కడ నేను రాజభోగాలు అనుభవించలేను,'' అన్నది.

సుశీల, ''నువ్వలాగంటే మనం ఎప్పటికీ ఇక్కడే ఉండిపోతాం. అరణ్యవాసం, నీకూ తమ్ముళ్ళకే తప్ప, మా ఇద్దరికీ అంత కష్టంగా లేదు. కాబట్టి నువ్వు, నీ తమ్ముళ్ళను తీసుకెళ్ళు. ఆ తరవాత సమయం చూసుకుని తగిన పరిష్కారం చూడు,'' అన్నది కూతురును సముదాయిస్తూ. మనోహరి అందుకు సమ్మతించింది.



శమనకుడు బయటకువచ్చి మాణిక్య వర్మతో, ''రాజా, ఈ పెళ్ళి మాకు సమ్మతమే. అయితే, ఇప్పట్లోనేనూ, నా భార్యా అరణ్యం వదిలి రాలేము. ఇక్కడేకొంతకాలం ఉంటాము. మా పిల్లలు కౌశికుడు, చైతన్యుడు ఆమెతో వస్తారు,'' అన్నాడు.

రాజు అందుకు అంగీకరించాడు. అప్పుడు కౌశికుడు, చైతన్యుడు పూలు కోసి తెస్తే, సుశీల దండలు కట్టి ఇచ్చింది. వధూవరులు మాలలు మార్చుకున్నారు. మాణిక్యవర్మ అత్తమామల దీవెనలందుకుని, భార్యనూ, బావమరదులనూ వెంట బెట్టుకుని రాజ ధానికి బయలుదేరాడు.

అంతఃపురం చేరాక మాణిక్యవర్మ మనో హరితో, ''ఇక మీదట నీ మాట నాకు శిలా శాసనం. ఏమైనా కోరుకో. ఎంత అసాధ్యమైనా సాధించి, నా ప్రేమ నిరూపించుకుంటాను,'' అన్నాడు మందహాసం చేస్తూ.

మనోహరి తల అడ్డంగా ఊపుతూ, ''నేను పేదరాలిని. చదువు తక్కువ. శిలాశాసనం లాంటి కోరిక తమరిని కోరే అర్హత నాకు లేదు,'' అన్నది.

మాణిక్యవర్మ ఆమెను మెచ్చుకుని, ''నీ తల్లిదండ్రులు రాజభోగాలు తిరస్కరించారు. నువ్వు వరాన్ని తిరస్కరించావు. ఈ వ్యక్తిత్వాలే గొప్ప సంపద కాబట్టి మీరు పేదలు కారు. ఇక చదువైతే ఎప్పుడైనా నేర్చుకోవచ్చు,'' అంటూ బావమరదులకు రాజోచిత విద్యలు నేర్ప డానికి సమర్థులైన గురువులను నియోగించాడు. మనోహరికి రాజనీతి, రాచమర్యాదలు నేర్పడానికి శ్రీవాణి అనే విద్యావతిని నియమించాడు.

అక్కాతమ్ముళ్ళు, గురువుల పట్ల వినయ విధేయతలు, చదువుపట్ల అమితాసక్తిని కనబరచి ఆరు మాసాల్లోనే ఎన్నో విషయాల్లో ఆరితేరారు. ఆ మాట విన్న మాణిక్యవర్మ అమితానందం చెంది మనోహరితో, ''ఇప్పుడైనా నీ కోరిక చెప్పి నా ప్రేమ నిరూపించుకునే అవకాశం ఇవ్వు,'' అన్నాడు.

''నా తమ్ములు నగరపాలకులు కావాలని నా కోరిక. అయితే, మన దేశంలోని ఉత్తమ నగరపాలకుడి వద్ద శిక్షణ పొందాక, వారికా పదవులు దక్కాలి,'' అన్నది మనోహరి.

మాణిక్యవర్మ సాలోచనగా, ''నగరపాలకుడు సమర్థుడైతే నగరంలో నేరాలు తగ్గుతాయి. అంటే, ఏ నగరంలో నేరాలు తక్కు

వగా ఉంటే, ఆ నగరపాలకుడు ఉత్తముడు. అవునా?'' అన్నాడు.

మనోహరి వెంటనే, ''నిజమే కాని, ఒక నగరంలో చిల్లర నేరాలు ఎక్కువ జరగవచ్చు. మరో నగరంలో ప్రమాదకరమైన హత్య ఒక్కటే జరగవచ్చు. కాబట్టి నేరాల సంఖ్యకంటే, వాటి స్థాయి ముఖ్యం. అది తెలుసుకోవడానికి శిక్షలే సూచికలు. ఏ నగరంలో యావజ్జీవ కారాగారం, రాజ్యబహిష్కారం, మరణదండన వంటి శిక్షలు తక్కువగా అమలయ్యాయో, ఆ నగరపాలకుణ్ణే ఉత్తముడిగా నిర్ణయించవచ్చు. అందుకు గత పది సంవత్సరాలుగా అమలైన శిక్షల వివరాలు తెలుసుకోవాలి,'' అన్నది.



మాణిక్యవర్మకు ఈ సూచన నచ్చింది. గత పది సంవత్సరాలుగా అమలు జరిగిన శిక్షల వివరాలు పంపమంటూ అన్ని నగరాలకూ వర్తమానం పంపాడు. ఆ వర్తమానం అరాతీసి, అసలు విషయం తెలుసుకున్నాక, ఉత్తముడిగా ఎన్నుకోబడాలన్న ఆశ ప్రతి నగరపాలకుడికీ కలిగింది. దాంతో వారిలో చాలా మంది అనుభవిస్తున్న వారి కారాగార శిక్షలు రద్దు చేశారు. నేరాలకు సంబంధించిన పాత చిఠాలను మార్చి కొత్త చిఠాలను రాశారు.

మణిపురం నగరపాలకుడు సుమంతుడైతే, చారుల ద్వారా ఇతర నగరాల వివరాలు సేకరించాడు. పాత చిఠాలు మార్చి అన్ని నగరాలకంటే తన నగరంలో తక్కువ నేరాలు జరిగినట్టు నమోదు చేయించాడు. ఆ ప్రకారం గత పది సంవత్సరాల్లోనూ మణిపురంలో యావజ్జీవ కారాగారం, రాజ్యబహిష్కారం, మరణ దండన ఒక్కసారి కూడా విధించబడలేదు.

అన్ని నగరాల నుంచీ మాణిక్యవర్మకు చిఠాలు అందాయి. వాటిని పరిశీలించాక, ''వీటినిబట్టి నగరపాలకులందరిలోకీ అధముడు సురేంద్రుడనీ, ఉత్తముడు సుమంతుడనీ తేలింది. మీ తమ్ములను సుమంతుడి వద్దకు శిక్షణకు పంపుతాను,'' అన్నాడు.

''వద్దు ప్రభూ, శిక్షణకు మా తమ్ములను సురేంద్రుడి వద్దకే పంపండి. అరణ్యంలో ఉన్న నా తల్లిదండ్రులను సగౌరవంగా రాజధానికి తీసుకువచ్చే గౌరవం సుమంతుడి కివ్వండి,'' అన్నది మనోహరి. రాజు సరే అన్నాడు.

బేతాళుడు ఇంతవరకు చెప్పి, ''రాజా, మనోహరి నగరపాలకులందరిలోకీ అసమర్థు

డైన సురేంద్రుడి వద్దకు తన తమ్ములను శిక్షణకు పంపడం ఎంతవరకు సమంజసం? అందులోని ఆంతర్యం ఏమిటి? తన తల్లి దండ్రులకు రాజ్య బహిష్కార శిక్ష విధించిన సుమంతుణ్ణే వారి వద్దకు పంపడం వల్ల తమ గుట్టు రట్టు కాదా? ఇది కొరివితో తల గోక్కో వడంగాక మరేమిటి? నా సందేహాలకు సమా ధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజ సత్కారం కోసం కక్కుర్తి పడకుండా తమ నగరంలో జరిగిన నేరాలు, శిక్షల వివరాలు ఉన్నదు న్నట్టు పంపిన సురేంద్రుడు గొప్ప నిజాయితీ పరుడు. తక్కిన వాళ్ళందరూ మోసగాళ్ళు. తను బాగా ఎరిగిన సుమంతుడు పంపిన చిఠాను పరిశీలించగానే కుశాగ్రబుద్ధి అయిన మనోహరికి ఆ సంగతి అర్థమై ఉంటుంది. నగరపాలనకు నిజాయితీపరులవద్ద శిక్షణ పొందితేనే ప్రయోజనం ఉంటుంది. అందుకే తన సోదరులను సురేంద్రుడి వద్దకు శిక్షణకు పంపమని కోరింది. సుమంతుడు పంపిన చిఠాలో తన తల్లిదండ్రుల రాజ్య బహిష్కార శిక్ష వివరాలు నమోదు కాలేదు. అంటే, ఆయన అన్యాయంగా వారికి ఆ శిక్ష విధించా డను కోవాలి. లేదా చిఠా మార్చి రాయించా డను కోవాలి. బయటపడితే ఈ రెండూ నేరాలే. రట్టయ్యేది సుమంతుడి దుర్మార్గమే. అతడు చేసినదానికి శిక్షగానే అతన్ని తన తల్లిదండ్రులను తీసుకురావడానికి అడవికి వెళ్ళేలా చేసింది. అహంభావి అయిన అధి కారికి అంతకుమించిన అవమానం ఉండదు. అది తక్కిన నగరపాలకులకు హెచ్చరికగా కూడా ఉంటుందనడంలో సందేహం లేదు. ఒక నిర్ణయం తీసుకోవడంతో అధికార దుర్వి నియోగం చేయకుండా ప్రతీకారం తీర్చు కుని, దాని ద్వారా తల్లిదండ్రులవిముక్తినీ, దేశక్షేమాన్నీ కూడా సాధించిన మనోహరి చాలా వివేకవతి,'' అని అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]








## మోఢేరా సూర్య మందిరం

మనదేశంలో మూడు ముఖ్యమైన సూర్య దేవాలయాలు ఉన్నాయి. మొదటిది ఒరిస్సా రాష్ట్రం కోణార్కలోని అతి పెద్ద సుప్రసిద్ధ దేవాలయం. అది 24 చక్రాలతో రథాకృతిలో నిర్మించబడి ఉన్నది. రథాన్ని సప్తాశ్వాలు లాగుతున్నట్టు ఉంటుంది. హిమాలయాల నేపథ్యంలో కాశ్మీరులో 'మార్తాండ మందిరం' నిర్మించబడింది. ఇది రెండవది. మూడవ దేవాలయం గుజరాత్ రాష్ట్రంలో అహ్మదాబాదుకు 100 కి.మీ. దూరంలో వున్న మోఢేరాలో ఉన్నది. శిథిలావస్థలో ఉన్నప్పటికీ ఈ ఆలయం కూడా మిగతా రెండింటిలాగే బ్రహ్మాండంగా కనిపిస్తుంది. ఇది 900 సం.లకు పూర్వం నిర్మించబడింది. యేటా రాత్రింబవళ్ళు సమానంగా ఉండే మార్చ్ 21వ తేదీ, సెప్టెంబర్ 22వ తేదీలలో సూర్యోదయ కిరణాలు గర్భగుడిలోని విగ్రహం మీద ప్రసరించేలా నిర్మించబడి వుండడం ఈ ఆలయ ప్రత్యేకత!

## భారత దేశంలో మూలాలు

సుప్రసిద్ధ యుద్ధకళలైన జూడో, కుంగ్ఫూ, కరాటేల తొలి మూలాలు మన దేశానికి చెందినవని చెబుతారు. క్రీ.శ. 5వ శతాబ్దంలో బోధిధర్ముడనే బౌద్ధ సన్యాసి కేరళ యుద్ధ కళ 'కళరిపయట్టు'ను చైనాకు తీసుకువెళ్ళి ప్రాచుర్యం కలిగించాడు. దానిని పో-టీ-టామా అనేవారు. ఆయన ఆ కళను జూడోలాంటి యుద్ధకళలకు పుట్టినిల్లయిన షావోలిన్ ఆలయంలో నేర్పాడు.



## మేఘాలయ జానపద కథ

# తండ్రికిచ్చిన మాట!

మేఘాలయలోని స్మిత్ అనే చిన్న పట్టణంలో ఒక వ్యాపారి చిన్న దుకాణం పెట్టుకుని జీవ యాత్ర సాగించేవాడు. అతని కొడుకు బాయెన్ మంచి స్వభావం కలవాడు. తండ్రి పట్ల అమిత మైన ప్రేమ కనబరచేవాడు. అయితే, తల్లి లేని బిడ్డ అని తండ్రి అతిగారాబం చూపడం వల్లనో ఏమో అతడు కాస్త అమాయకంగా కనిపించే వాడు. ఏ విషయంలోగాని త్వరలో ఒక నిర్ణయా నికి వచ్చేవాడు కాదు.

వర్తకుడు వృద్ధాప్యంలో అడుగుపెట్టాడు. తను ఇక ఎంతకాలమో బతకలేనని గ్రహించి,



తన తదనంతరం కొడుకు ఎలా బతుకుతాడో ఏమోనని దిగులు పడసాగాడు. అతడు ఒక నాడు కొడుకును చేర బిలిచి, "నాయనా, బాయెన్, నేను ఇక ఎన్నాళ్ళో బతకను. నా తర వాత నువ్వే మన దుకాణాన్ని నడపాలి. శ్రద్ధగా, కష్టపడితే తప్ప నీ కుటుంబానికి సరిపడా ఆదాయం రాదు. నేనిచ్చే మూడు సలహాలనూ పాటిస్తానని నాకు మాట ఇవ్వాలి," అన్నాడు.

"తప్పకుండా నాన్నా, ఏం చెయ్యాలో సెల విన్వండి," అన్నాడు బాయెన్ వినయంగా.

"మొదటిది, నువ్వు ఇంటి నుంచి దుకాణా నికి ఎండలో నడవ కూడదు. రెండవది, నువ్వు రోజూ అన్నం మాత్రమే తినాలి. మూడవది నువ్వు పెళ్ళి చేసుకునేప్పుడు వారానికొక కొత్త భార్యను తెచ్చుకోవాలి," అన్నాడు తండ్రి.

బాధ్యతాయుతమైన కొడుకుగా, బాయెన్ తండ్రికి ఆ మూడు సలహాలనూ పాటిస్తానని మాట ఇచ్చాడు. "నేను నువ్వు చెప్పినట్టే తప్ప కుండా నడుచుకుంటాను నాన్నా. అయినా, అవి నాకెలా ఉపయోగపడగలవన్నదే అర్థం కావడం లేదు," అన్నాడు తండ్రితో.

"ఆ సంగతి కాలమే నీకు చెబుతుంది. విచార పడవద్దు," అన్నాడు తండ్రి.

ఆ తరవాత వర్తకుడు చాలా రోజులు బతక లేదు. ఒక నాటి సాయంకాలం దుకాణం నుంచి తిరిగి రాగానే కన్నుమూశాడు. బాయెన్ తండ్రికి అంత్యక్రియలు సక్రమంగా జరిపించాడు. ఆ

పిమ్మట తండ్రికి చేసిన వాగ్దానాలు అత నికి గుర్తుకు వచ్చాయి.

ఇంటికీ దుకాణానికీ మధ్య ఎండలో నడవకు, అన్నాడు నాన్న. ఇందులో ఆయన ఉద్దేశం ఏమై ఉంటుంది? దుకాణం ఇంటికి అట్టే దూరంలో లేదు. అందువల్ల ఈ మధ్య దూరానికి పందిరి వేయిం చాడు. పందిరి ఎండ పడకుండా నీడని స్తోంది గనక, అతడు ఎండలో నడవవల సిన అవసరం లేకుండా పోయింది.

పందిరి నిర్మించడానికి బోలెడు ఖర్చ యింది. వృథా ఖర్చు చేస్తున్నావని బాయెన్ మిత్రులు అతణ్ణి హేళన చేశారు. "అయినా, నేను తండ్రికి మాట ఇచ్చాను కదా?" అన్నాడు బాయెన్.



ఆ తరవాత అతనికి రెండవ సలహా గుర్తుకు వచ్చి, అన్నం మాత్రం తినడం పెద్ద కష్టమైన పనేమీ కాదనుకున్నాడు. అయితే, రోజూ అన్నమే తినడంవల్ల కొన్నాళ్ళకు మొహం మొత్త ఆరంభమయింది.

మిత్రులు కొన్ని సందర్భాల్లో బాయెన్‌ను తమ ఇళ్ళకు భోజనానికి పిలిచేవారు. అయితే బాయెన్ వెళ్ళేవాడు కాదు. "ఒకవేళ వాళ్ళు అన్నం కాకుండా మరేదయినా వడ్డిస్తే! నేను నా తండ్రికిచ్చిన మాట తప్పినవాణ్ణి అవుతాను కదా?" అనుకుని ఇంటిపట్టునే భోజనం చేసేవాడు. అయినా ఆ సంగతి అతడు మిత్రు లకు చెప్పేవాడు కాదు.

పెళ్ళీడుకొచ్చిన ఆడపిల్లల తండ్రులు కొందరు బాయెన్‌నుకు తమ కూతురునిచ్చి పెళ్ళి చేస్తే బావుంటుందని ఆశించారు. కాని అలా వచ్చేవారితో బాయెన్, "నేను మీ కూతుర్ని పెళ్ళి చేసుకుంటాను. అయితే, ఆమె ఒక వారం మాత్రమే నా భార్యగా ఉండగలదు," అని నిబంధన విధించేవాడు. దాంతో వాళ్ళు పట్టరాని కోపంతో తిరిగి వెళ్ళేవారు.

బాయెన్ వింత నిబంధన వినడంవల్ల ఎవరూ పెళ్ళిప్రతిపాదనతో అతడి దరిదాపులకు వచ్చే వారు కారు. మరి కొందరు అతన్ని గురించి చెప్పుకుని పరిహాసంతో నవ్వుకునేవారు.

బాయెన్ వింత నిబంధన గురించి విన్న మార్యం అనే ఒక యువతి తీవ్రంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. తాను బాయెన్‌ను వివాహ మాడతానని తన తల్లిదండ్రులకు తెలియజేసింది.

ఆ మాట విన్న తల్లిదండ్రులు హడలిపోయి, "ఒక వారం తరవాత అతడు నిన్ను తరిమేస్తే ఏమవుతుందో ఆలోచించావా? మూర్ఖంగా



మాట్లాడకు. నీకు వేరొక వరుణ్ణి చూస్తాం,'' అన్నారు.

''అతడు నన్ను పంపలేడు, మీరే చూస్తారు కదా. కాస్త ఓపికపట్టినేను చెప్పినట్టు చేయండి,'' అన్నది మార్యం అచంచలమైన విశ్వాసంతో.

ఆ తరవాత ఆమె తల్లిదండ్రులు బాయెన్ వద్దకు వెళ్ళి తమ కూతురును వచ్చి చూడమని ఇంటికి ఆహ్వానించారు. బాయెన్ మార్యంను చూసి ఆమె అందచందాలకూ, ఆహ్లాదకరమైన ప్రవర్తనకూ ముగ్ధుడయ్యాడు.

అతడు చాలా నిజాయితీ పరుడు గనక, తాను తండ్రి కిచ్చిన మాట గురించి వివరించి, ''వాటిని నేనెన్నటికీ జవదాటను,'' అన్నాడు.

''ఆ సంగతి నాకూ తెలుసు. విచారించకు,'' అన్నది మార్యం చిన్నగా నవ్వుతూ.

పెళ్ళి ఘనంగా జరిగింది. బాయెన్ స్నేహితులందరూ పెళ్ళికి వచ్చారు. మార్యం తల్లి దండ్రులు గొప్ప విందు ఏర్పాటు చేశారు.

ఆచారం ప్రకారం విందు పూర్తి అయిన వెంటనే బాయెన్ పెళ్ళికూతురును తమ ఇంటికి తీసుకు వెళ్ళాలి. అతని మిత్రులు వధూవరుల వెంట కొంత దూరం వెళ్ళి శుభాకాంక్షలు చెప్పి సాగనంపారు. ''అతడు వారంలో ఆమెను వెంట బెట్టుకుని తిరిగి వస్తేనే చిక్కంతా,'' అని తమలో తాము మాట్లాడుకుంటూ తమ ఇళ్ళకు బయలుదేరారు.

కొత్త దంపతులు అనురాగంతో అన్యోన్యంగా వారం రోజులు గడిపారు. మార్యం భర్త మీద అమిత ప్రేమను కనబరిచింది.

ఏడవ రోజు సాయంకాలం దుకాణం నుంచి హడావుడిగా ఇంటికి వచ్చిన బాయెన్ అశాంతితో కనిపించాడు. మార్యం ఆ విషయం గమనించింది. అయినా, ఏమీ ఎరగనట్టు ఇంటి పనులు చేసుకోసాగింది.

''రేపే నేను ఈమెను పంపెయ్యాలి. తండ్రి కిచ్చిన మాటను ఎలా తప్పగలను?'' ఈ ఆలోచన బాయెన్‌కు రాత్రంతా నిద్రపట్టకుండా చేసింది. మరునాడు తెల్లవారగానే అతడు బయలుదేరుతూ, ''మార్యం, నువ్వింకా సిద్ధం కాలేదా?'' అని అడిగాడు.

''ఈ రోజు నేను ఎక్కడికీ వెళ్ళడం లేదే,'' అన్నది మార్యం అమాయకంగా.

''నిన్ను నేను ఈరోజు మీ ఇంటికి తిరిగి పంపించాలి. అది నేను నా తండ్రి కిచ్చిన మాట అన్న సంగతి నీకు తెలిసిందే కదా? నేను దాన్ని తప్పలేను,'' అన్నాడు బాయెన్.

''మీ నాన్న చాలా తెలివైన వర్తకుడు. నీ పట్ల ఎంతో ప్రేమాభిమానాలు కలవాడు. అవునా? అలాంటి పెద్దమనిషి నిన్ను చూసి ఊరంతా నవ్వుకునే విధంగా నిన్ను ప్రవర్తించమనే సలహాలు ఇచ్చి ఉంటాడంటావా?'' అన్నది మార్యం.

''ఏమిటి నువ్వంటున్నది? మా తండ్రి ఇచ్చిన మూడు సలహాల గురించేనా?'' అని అడిగాడు బాయెన్ అమాయకంగా.

''అవును. ఆయన ఇచ్చిన మొదటి సలహా నువ్వు దుకాణానికి ఎండలో నడవకూడదు అన్నది. అంటే, సూర్యోదయం ముందే వెళ్ళి దుకాణం తెరిచి, శ్రద్ధగా వ్యాపారం చూసుకుని సూర్యుడు అస్తమించాక ఇంటికి రమ్మని చెప్పడం ఆయన ఉద్దేశం. నువ్వేం చేశావు? ఉన్న డబ్బంతా ఖర్చు పెట్టి ఇంటి నుంచి దుకాణం వరకు పందిరి వేయించావు. ఎంత తెలివిమాలిన పని చూశావా?'' అన్నది మార్యం.

''ఇక రెండో సలహా, అన్నం మాత్రమే తినమనడం. అవునా? అవసరమైనంత వరకు మాత్రమే తిని, ఆడంబరాలకు పోయి ఆరోగ్యం పాడుచేసుకోకుండా ఉండాలన్నది మీ తండ్రి అభిప్రాయం. అయితే, నువ్వు ఏం చేశావ్? స్నేహితులు భోజనానికి పిలిచినా వెళ్ళకుండా ఇంటి దగ్గరే కూర్చున్నావు. నీ ప్రవర్తన చూసి నీ తండ్రి ఆత్మ శాంతిస్తుందంటావా?'' అన్నది మార్యం.

ఇక తండ్రి ఇచ్చిన మూడో సలహాను గురించి మార్యం ఏం వివరణ ఇస్తుందోనని ఆతృతగా ఎదురు చూడసాగాడు బాయెన్.

''నువ్వు నీ భార్యను ఎల్లప్పుడూ ప్రేమానురాగాలతో చూసుకోవాలన్నదే నీ తండ్రి మూడవ కోరిక. ఈ వారం రోజులు కొత్తగా వచ్చిన నన్నెంత ఆప్యాయంగా చూసుకున్నావు? జీవితాంతం అలాగే చూసుకోవాలి. ఆలుమగలు మాయని మమకారంతో కలిసిమెలిసి చివరిదాకా జీవించాలన్నదే మా మామగారు ఇచ్చిన మూడవ సలహాలోని అంతరార్థం!'' అన్నది మార్యం గంభీరంగా.

బాయెన్ పట్టరాని ఆనందంతో నవ్వుతూ, భార్యకు మరింత దగ్గరగా వెళ్ళి, ''నువ్వింత వివేకవంతురాలివని నేను ఊహించ లేదు. ఇక, నేను నిన్ను మీ ఇంటికి తిప్పి పంపే ప్రసక్తే లేదు. నా ప్రియమైన ఇల్లాలుగా నువ్వు జీవితాంతం నాతోనే ఉండాలి,'' అన్నాడు.



# అంతరిక్షం నుంచి తిరిగి వచ్చిన సునీత



భారతీయ సంతతికి చెందిన సునీతా విలియమ్స్, మరి ఆరుగురు వ్యోమగాములతో అంతరిక్షానికి వెళ్ళిన అంతరిక్ష క్షిపణి అట్లాంటిస్ జూన్ 23వ తేదీ కాలిఫోర్నియాలోని ఎడ్వర్డ్స్ ఎయిర్ ఫోర్స్ బేస్‌లో సురక్షితంగా భూమికి చేరుకున్నది. జూన్ 21వ తేదీ భూమికి రావలసిన క్షిపణి ప్రతికూల వాతావరణం వల్ల ఆలస్యమయింది. అంత వరకు అట్లాంటిస్ అర్బిట్‌లోనే ఉండవలసి వచ్చింది. క్షిపణి క్షేమంగా భూమికి చేరడంతో యావత్ ప్రపంచమే ఊరట చెందింది.

మొదట ఇంటర్నేషనల్ స్పేస్ స్టేషన్ (ఐఎస్ఎస్)లో ఉన్న కాలాన్ని పొడిగించడంతో పాటు, ఆ తరవాత అక్కడినుంచి 'డీ-డాకింగ్' అయిన తరవాత కూడా అక్కడే ఉండడం; పరోక్షంగా సునీత అంతరిక్షంలో గడిపిన సమయాన్ని పెంచింది. జూన్ 16వ తేదీ నాటికే ఆమె, అంతకు ముందు అంటే 1996లో, రష్యన్ స్పేస్ స్టేషన్ 'మిర్'లో షేనాన్ లూసిడ్ 188 రోజులా 4 గంటలు గడిపి నెలకొల్పిన రికార్డును అధిగమించింది. అట్లాంటిస్ భూమికి చేరే సమయానికి సునీత మొత్తం 195 రోజులు అంతరిక్షంలో గడిపింది.

ఐఎస్ఎస్‌లో ఉన్నప్పుడు ఆమె 4 సార్లు అంటే 29 గంటలా 17 నిమిషాలు 'స్పేస్ వాక్' చేయడం ఒక రికార్డు. ఆ తరవాత ఆమె అక్కడి నుంచే 'బోస్టన్ మారథాన్'లో పాల్గొనడం మరొక రికార్డు. ఐఎస్ఎస్‌లో ట్రెడ్‌మిల్ మీద 4 గంటలా 23 నిమిషాల్లో భూమి మీది 42 కి.మీ. దూరం 'పరిగెత్తింది'. భూమికి 340 కి.మీ. దూరంలో వుంటూ మారథాన్‌లో 'పాల్గొనడం' సరికొత్త రికార్డు.

ఈ ఆరు నెలలకు పైగా సునీత అక్కడ ఎలాంటి ఆహారం తీసుకున్నదో తెలుసుకోవాలని చాలా మందికి ఆదుర్దా ఉంటుంది కదూ. సుషి, కర్రీ వెజిటబుల్స్, పీనట్ సాస్‌తో చికెన్, హామ్, ఆమ్లెట్స్-ఇవీ ఆమె ఆహారం. భూమికి చేరగానే, సమీపంలో ఉన్న ఇండియన్ రెస్టారెంటుకు వెళ్ళాలని ఆమె ఒక ఇంటర్వ్యూలో తెలియజేసింది.

ఐఎస్ఎస్ లో సునీతా విలియమ్స్ స్థానానికి ఇప్పుడు ఫ్లైట్ ఇంజినర్ క్లౌటన్ యాండర్‌సెన్ వెళ్ళాడు.

# చందమామ
# ఇండియా క్విజ్ - 7

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు
రాసిన ఒకరికి బహుమతి
రూ. 250లు.*

ఈ నెల క్విజ్ మన పార్లమెంటుకు సంబంధించినది.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్-7 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. ఆగస్ట్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. అక్టోబర్ 2007 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. భారత రాష్ట్రపతి పార్లమెంటును ఎప్పుడు ప్రారంభిస్తాడు?
2. లోక్‌సభ మొట్టమొదటి స్పీకర్ ఎవరు?
3. ఉపరాష్ట్రపతి నిర్వహించే అదనపు పదవి ఏది?
4. రాజ్యసభ సభ్యులను ఎవరు ఎన్నుకుంటారు?
5. భారతరాష్ట్రపతికి ఎవరు పదవీ ప్రమాణ స్వీకారం చేయిస్తారు?
6. రాజ్యసభ తొలి అధ్యక్షుడు ఎవరు?
7. ఉపరాష్ట్రపతి కావడానికి కనీస వయోపరిమితి ఎంత?
8. రాష్ట్రపతి లోక్‌సభకు ఇద్దరు సభ్యులను నామినేట్ చేయవచ్చు. వారు ఎవరు?
9. భారత ఉపరాష్ట్రపతిని ఎవరు ఎన్నుకుంటారు?
10. ప్రథమ లోక్‌సభ సమావేశం ఎప్పుడు జరిగింది?

## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (20)

# లలితాదిత్యుడి ఔదార్యం!

పన్నెండవ శతాబ్దానికి చెందిన కల్హణుడు రచించిన 'రాజ తరంగిణి'లోని కాశ్మీరు రాజు లలితాదిత్యుడు ఉత్తమ పాలకుడే అయినప్పటికీ, నాటి రాజులందరిలాగే నూతన రాజ్యాలను జయించడానికి ఆతృత కనబరచేవాడు.

గోబి ఎడారికి ఆవలనున్న చిన్నరాజ్యాన్ని బలహీనుడైన రాజు పాలిస్తున్నాడని ఆయనకు తెలియవచ్చింది. దానిని ఆక్రమించి సామంత రాజ్యంగా చేసుకుని పాలించడం కష్టం కాదని భావించాడు. బలమైన సైన్యాన్ని సమాయత్తం చేసుకుని, స్వయంగా నాయకత్వం వహించి ఆశించిన దిశగా ముందుకు సాగాడు. మార్గ మధ్యంలో చిరిగిన దుస్తులతో ఒక పెద్దమనిషి రాజు గుర్రం ముందు కన్నీళ్ళతో మోకరిల్లాడు.

''ప్రభూ, తమరిని సభలోనే దర్శించి, మా చిన్న రాజ్యం మీదికి దండెత్తకండి అని వేడుకోవాలని వచ్చాను. అయితే, ఇప్పటికే మీరు సైన్యంతో దండయాత్రకు బయలుదేరినట్టున్నది,'' అన్నాడు అతడు లేచి నిలబడుతూ.

లలితాదిత్యుడు ముట్టడించనున్న రాజ్యం ప్రధానమంత్రిగా అతడు తనను పరిచయం చేసుకుని, ''గొప్ప సైనికబలంగల లలితాదిత్యుణ్ణి ఎదుర్కొని నిలబడడం, మనరాజ్యాన్ని కాపాడుకోవడం అసాధ్యం. అందువల్ల ముందుగానే లొంగిపోవడం మంచిదని మా రాజుగారికి సలహా ఇచ్చాను. అయితే, ఆయన నా మాట వినక నన్ను కొట్టి అవమానించాడు. అన్ని అవమానాలూ సహించి ఇప్పుడు మీ దగ్గరికి వచ్చాను. మా రాజ్య ప్రజలు మీదాడిని భరించే స్థితిలో లేరు. వారిని బాధలకు గురిచేసే ఈ ముట్టడిని మానుకోండి,'' అని వేడుకున్నాడు.

అంతావిన్న రాజు, ''మీ రాజ్య ప్రజలపట్ల నీకున్న శ్రద్ధను అభినందిస్తున్నాను. అయితే, దండయాత్రను విరమించుకుని వెనుదిరిగే ప్రసక్తే లేదు. అయినా, మేము విజయం సాధించేంతవరకు మీ సేనలతో యుద్ధం చేస్తామే తప్ప, సామాన్య ప్రజలకు ఎలాంటి బాధలూ కలిగించము. మీరాజు నిన్ను అవమానించినప్పటికీ, నీ దేశప్రజల పట్ల నీకున్న ప్రేమ, ఇంకా పోలేదు. మేము నీ రాజ్య ప్రజల పట్ల చూపుతూన్న కరుణకు ప్రత్యుపకారంగా నువ్వు మా సైన్యంలో చేరి సహకరించవచ్చు కదా?'' అన్నాడు.

### చందమామ ఇండియా క్విజ్-5 (జూన్ 2007) సమాధానాలు

1. ఫతేపూర్ సిక్రీలోని సలీం చిష్టి దర్గా.
2. జైపూర్, ఢిల్లీ నగరాలలోని జంతర్ మంతర్.
3. ఔరంగాబాదు సమీపంలోని అజంతా గుహలు.
4. మహాత్మాగాంధి; పుణేలోని ఆగాఖాన్ భవనం.
5. కాశ్మీరులో 13,000 అడుగుల ఎత్తులో ఉన్న అమరనాథ్.
6. ఉత్తర ప్రదేశ్‌లోని సారనాథ్.
7. కురుక్షేత్రంలో (హర్యానా).
8. చెన్నయ్‌లోని సెయింట్ థామస్ మౌంట్.

ఆ విషయం గురించి కొంతసేపు తీవ్రంగా ఆలోచించాక, మంత్రి అందుకు సమ్మతించాడు.

రాజు సంతోషించి ఆయన్ను తన స్నేహితుడిలా చూడసాగాడు. అప్పుడాయన, "ప్రభూ, ఎడారిని చుట్టుకుని మామూలు మార్గం గుండా వెళ్ళాలంటే రాజధానిని చేరడానికి చాలా కాలం పడుతుంది. నాకు ఎడారి గుండా అడ్డు దారి తెలుసు. దాని గుండా వెళితే, పదిహేను రోజుల్లో మన గమ్యం చేరుకోవచ్చు. అయితే, ఆ పదిహేను రోజులకు సరిపడా, మంచినీళ్ళు మన వెంట తీసుకువెళ్ళవలసి ఉంటుంది," అన్నాడు.

రాజుకు ఆ సూచన చాలా హేతుబద్ధంగా కనిపించింది. అలాగే వెళ్ళడానికి నిర్ణయించాడు. మంత్రి వెంట ఎడారి గుండా సైన్యం నడవసాగింది. మొదట అందరూ ఎంతో ఉత్సాహంతో ముందుకు సాగారు. కాని ఎడారి వేడి వారిని త్వరలోనే అలిసిపోయేలా చేసింది. వెంట తెచ్చుకున్న మంచినీరు అయిపోసాగింది. అప్పటికే మూడు వారాలు గడిచిపోయాయి.

"ఇంకా రాజధాని ఎంత దూరంలో ఉంది?" అని అడిగాడు లలితాదిత్యుడు మంత్రిని.

మంత్రి పేలవంగా నవ్వి, "మరికొన్ని రోజుల్లోనే మనమందరం మన ఆఖరి గమ్యాన్ని చేరుకోక తప్పదు. ఎందుకంటే-తాగడానికి నీళ్ళు లేకుండా మనమెన్నాళ్ళని ప్రాణాలతో బతగ్గలం? అయితే, మనందరిలోకీ నేనే మొదట అక్కడికి చేరుకుంటాను. అందులో సందేహం లేదు. నిజం తెలియగానే మీరు నన్ను చంపేస్తారు. నా రాజు కోసం, మా ప్రజల క్షేమం కోసం నేను కావాలనే మిమ్మల్ని తప్పుదారి పట్టించానన్నది కఠోర సత్యం!" అన్నాడు.

లలితాదిత్యుడు దిగ్భ్రాంతి చెందాడు. అయితే, మంత్రిని చంపలేదు. తమతో వెంట బెట్టుకు వచ్చిన భూగర్భజలాలను కనుగొనే నిపుణుణ్ణి పిలిచి, ఆ దరిదాపుల్లో నీళ్ళున్నాయేమో చూడమన్నాడు. అదృష్టవశాత్తు వారికి పక్కనే నేలకింద నీళ్ళుండడం తెలియవచ్చింది. అక్కడ తవ్వగానే కావలసినంత జల పైకి ఉబికింది.

అప్పుడు లలితాదిత్యుడు మంత్రితో, "నువ్వు మాకు నమ్మకద్రోహం చేశావు. కాని నీ రాజుకూ, రాజ్యప్రజలకూ విశ్వాసపాత్రుడుగానే మసలుకున్నావు. నిన్ను క్షమించి ప్రాణాలతో వదిలిపెడుతున్నాను. నేను మీ రాజ్యం మీదికి దండెత్తి వెళ్ళకుండా మా రాజ్యానికి తిరిగివెళుతున్నాను. నువ్వు మాతోనే ఉండి, మీ రాజ్యానికి మార్గం కనుగొనేంతవరకు, మా ఆహార పానీయాలను పంచుకోవచ్చు," అన్నాడు. -(ఎం.డి)



# పెద్దల సందేశాలు

చందమామను ప్రారంభించినప్పటి నుంచీ ఎందరో పెద్దల నుంచి శుభాకాంక్షలు, అభినందనలు, సందేశాలు అందుకుంటూనే ఉన్నాం. ఈ సందర్భంలో అలాంటి పెద్దల మనోభావాలను పాఠకులతో పంచుకోవడానికి ఎంతో సంతోషిస్తున్నాం.

ఒక పిల్లల పత్రికను ఒకేసారి ఇన్ని భాషలలో తీసుకురావడం అన్నది ఓ అసాధారణ విన్యాసం! పత్రిక విజయవంతం కావాలని కోరుకుంటున్నాను.

– పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

పిల్లల కోసం తీసుకువచ్చే ఇలాంటి ప్రచురణలు పిల్లలలో ఊహాశక్తిని పెంపొందించి, సౌందర్య స్పృహను కలిగించి, విద్యాసక్తిని ప్రోత్సహించాలి. అదే సమయంలో బయటి ప్రపంచంతో సమన్వయంతో జీవించడం కూడా బోధించాలి. చందమామకు శుభాకాంక్షలు.

– ఇందిరాగాంధి

ఉపయోగకరమైన బాలసాహిత్యాన్ని అందించే ఇలాంటి పత్రిక అక్షరాస్యతను పెంచడానికి చాలా అవసరం.

– డాక్టర్ రాజేంద్రప్రసాద్

సంస్కృత భాషా ప్రాచుర్యానికి మీరు చేస్తున్న మహత్తర కృషి చాలా ప్రశంసనీయమైనది!

– శృంగేరి శ్రీ శ్రీ జగద్గురు శంకరాచార్య

చందమామ పబ్లికేషన్స్ మనదేశంలోని బాలబాలికలకు నిర్మలమైన చక్కని వినోదం అందిస్తూ, వారి హృదయాలలో చెరగని స్థానం సంపాదించుకున్నది.

– మొరార్జీ దేశాయి

మన దేశంలో ఈ కోవకు చెందిన చాలా ఉపయోగకరమూ, వినోదాత్మకమూ అయిన ప్రచురణలలో చందమామ చాలా ప్రకాశవంతమైన పత్రిక.

– డా. సి.పి. రామస్వామి అయ్యర్

మన పిల్లలకూ, భారతీయ భాషలకూ ఎనలేని సేవలందిస్తూన్న చందమామ పబ్లికేషన్స్‌ను అభినందిస్తున్నాను. పిల్లల మనోవైశాల్యాన్ని విస్తృత పరచి, జ్ఞాన పరిధిని విశాల పరచగల విషయాలను అందజేయగలరని విశ్వసిస్తున్నాను.

– డా. ఫక్రుద్దీన్ అలీ అహ్మద్

సుసంపన్నమైన భారతదేశ సాంస్కృతిక వారసత్వానికి సంబంధించిన కథలతో లక్షలాది మంది బాలబాలికలను మంత్రముగ్ధుల్ని చేస్తూన్న పత్రిక చందమామ. నాకు ప్రత్యేక ఆనందం కలిగించిన విషయం ఏమిటంటే–మన సాంస్కృతిక, తాత్విక వారసత్వానికి ఆధారభూతమైన అత్యంత ప్రాచీనమూ, శాశ్వతమూ అయిన సంస్కృత భాషలో చందమామను ప్రచురిస్తూ, ఆ భాష ప్రాచుర్యానికి మీరు కృషి చేయడం.

– ఎ.బి. వాజ్‌పేయి

పిల్లల అభిమాన పత్రిక అయిన చందమామ పెద్దలకు కూడా చాలా ప్రియమైనది. ఆబాలగోపాలన్ని అలరించడంలో ఆకాశంలోని చందమామతో ఇది పోటీపడడం అందరికీ సంతోషం కలిగించే విషయం.

– పట్టాభి సీతారామయ్య

ఈ రోజు చందమామ ఒకగొప్ప సంస్థగా వెలుగొందుతున్నది. సృజనాత్మక మేధాసంపత్తి, అద్భుతమైన కృషి దీనిని సుసాధ్యం చేశాయి.

– వి. ఆర్. నార్ల

నేను కొన్ని చందమామ సంచికలను చూశాను. పిల్లలకు విద్యావిలువలుగల చక్కని పత్రికగా దీనిని భావిస్తున్నాను.

– డా. వి.వి. గిరి

తమ పిల్లల హృదయాలలో నిక్షిప్తమైవున్న మేధాశక్తినీ, కళాత్మక ప్రతిభనూ తట్టిలేపే తల్లిదండ్రుల బాధ్యతలాంటి పత్రికగా చందమామ భాసిల్లగలదని దృఢంగా విశ్వసిస్తున్నాను.

– డా. సి.ఆర్. రెడ్డి

అభిరుచిగల కథలు మెచ్చుకోతగినవిగా ఉన్నాయి. సంస్కృత భాషా ప్రాచుర్యానికి మీరు చేస్తున్న ప్రయత్నాలు ఎంతైనా అభినందించ తగ్గవి.

– డా. మురళీ మనోహర్ జోషి



## నాకు నచ్చిన కథ-2



డాక్టర్ కె.ఎస్. దుగ్గల్ 1966-73 మధ్య కాలంలో నేషనల్ బుక్ ట్రస్ట్ డైరెక్టర్‌గా పదవీ బాధ్యతలు నిర్వహించారు. ఆ తరవాత భారత ప్రభుత్వ ప్రణాళికా సంఘం (సమాచారం) సలహాదారుగా పని చేసి 1976లో పదవీ విరమణ చేశారు. పంజాబీ, ఉర్దూ, హిందీ, ఇంగ్లీష్ భాషలలో సుప్రసిద్ధ రచయిత అయిన దుగ్గల్ వివిధ భాషలలో 150 గ్రంథాలకు పైగా రచించారు. 1988లో పద్మభూషణ్ బిరుదుతో సత్కరించబడిన డా. దుగ్గల్ రాజ్యసభ సభ్యులుగా ఆరేళ్ళు ఉన్నారు. 2007లో ఆయనకు సాహిత్య అకాడెమీ ఫెలోషిప్ ఇవ్వబడింది.

# అద్భుతం!

"ఆ తరవాత గురువు అడవిగుండా నడవ సాగాడు. వేసవి ఎండ దహించేస్తోంది. చెట్టు చేమలు వాడిపోయాయి. చుట్టుపక్కల మానవ మాత్రుడు కనిపించడం లేదు. ఏ ప్రాణి అలికిడీ లేకుండా నిశ్చల నిశ్శబ్దంగా ఉంది."

"ఆ తరవాత ఏమయిందమ్మా?" అని అడిగాను ఆదుర్దాగా.

"గురువు నడుస్తున్నాడు. ఏవో ఆలోచనలలో మునిగిపోయాడు. ఆయన శిష్యుడికి దాహం వేసి నీళ్ళ కోసం అడిగాడు. "ఈ ప్రాంతంలో నీళ్ళా? కాస్త ఓపిక పట్టు, గ్రామం చేరాక కావలసినన్ని నీళ్ళు తనివితీరా తాగుదువు గాని," అన్నాడు గురువు నెమ్మదిగా. అయితే, దాహం ఎక్కువ కావడంతో శిష్యుడు ఆయన మాట వినకుండా నీళ్ళు కావాలని గొడవ చేయ సాగాడు. "నువ్వెంత మొత్తుకున్నా ప్రయోజనం లేదు. చుట్టుపక్కల నీటి చుక్క లేదు. విధి మీద భారంవేసి, రా," అన్నాడు గురువు మళ్ళీ. అయితే శిష్యుడు అడుగు ముందుకు వేయకుండా అలాగే కూర్చున్నాడు. శిష్యుడి మొండితనం చూసి మనసులో నవ్వుకున్న గురువు, ధ్యానం చేయడానికి కళ్ళు మూసుకున్నాడు. ఆయన కళ్ళు తెరిచి చూసినప్పుడు శిష్యుడు గింజుకుంటున్నాడు. గురువు చిన్నగా నవ్వి, "అదిగో చూడు ఆ చిన్న కొండ మీద గుడిసెలో ఒక ఫకీరు ఉంటున్నాడు. నువ్వెళ్ళి ఆ ఫకీరును నీళ్ళడుగు. అక్కడున్న బావిలో మాత్రమే నీళ్ళుండే అవకాశం ఉంది!" అన్నాడు.

"ఆ మాట వినగానే ఉన్న శక్తినంతా కూడదీసుకుని శిష్యుడు కొండ మీదికి పరిగెత్తి పోయాడు. మిట్టమధ్యాహ్నం మండుటెండలో అతి ప్రయాసతో రొప్పుతూ, రోజుతూ కొండ శిఖరాన్ని చేరి గుడిసెను కనుగొన్నాడు. ఫకీరుకు సలాంచేసి నీళ్ళు అడిగాడు. ఫకీరు బావిని చూపాడు. శిష్యుడు బావిని సమీపిస్తూండగా, ఏదో ఆలోచన రావడంతో ఫకీరు, "నాయనా, నువ్వెక్కడి నుంచి వస్తున్నావు?" అని అడిగాడు. "నేనొక గొప్ప గురువుగారి అనుచరుణ్ణి," అన్నాడు శిష్యుడు. గురువు అనే మాట వినగానే ఫకీరు, పట్టరాని ఆగ్రహంతో శిష్యుణ్ణి గుడిసె నుంచి బయటకు తరిమాడు. శిష్యుడు కొండ దిగి వచ్చి గురువుకు జరిగిన సంగతి చెప్పాడు.

గురువు మందహాసం చేస్తూ, ''ఈసారి వినయంగా వెళ్ళి, వేరొక ఫకీరు అనుచరుణ్ణని చెప్పు,'' అని సలహా ఇచ్చాడు. శిష్యుడు తన్ను తాను నొచ్చుకుంటూ మళ్ళీ కొండమీదికి వెళ్ళి, గురువు చెప్పినట్టే అడిగాడు. కాని ఫకీరు అతడి మాట పట్టించుకోకుండా పంపేశాడు. శిష్యుడు నడవలేక నడుచుకుంటూ కొండ దిగి గురువు వద్దకు వచ్చాడు. ''కీర్తి సమస్తం శక్తి సమన్వితుడైన భవంతుడికే చెందుతుంది,'' అంటూ ఆశ్చర్యపోయిన గురువు మళ్ళీ శిష్యుణ్ణి ఫకీరు వద్దకు వెళ్ళమన్నాడు. మూడోసారి కొండ ఎక్కి వెళ్ళిన శిష్యుడు, ఫకీరు పాదాలపై పడి గుక్కెడు నీళ్ళివ్వమని వేడుకున్నాడు. అయితే ఫకీరు, ''నీ గురువు చాలా పవిత్రుడని చెప్పుకుంటున్నాడు కదా. నీకు చేరడు నీళ్ళివ్వ లేడా?'' అంటూ హేళన చేస్తూ నీళ్ళివ్వడానికి కఠినంగా తిరస్కరించాడు. కొండ దిగి వచ్చిన శిష్యుడు గురువు పాదాలవద్ద సొమ్మసిల్లి పడిపోయాడు. గురువు శిష్యుడి వెన్నుచరిచి, ఎదుటవున్న చిన్న బండను పక్కకు తొలగించమని ఆదేశించాడు. శిష్యుడు అలాచేయగానే, అక్కడి నుంచి నీళ్ళు పెల్లుబికాయి. కొంతసేపటికల్లా చుట్టూ జలమయమయింది. అదే సమయంలో కొండ మీది ఫకీరు నీళ్ళు కావలసివచ్చి, బావి దగ్గరికి వెళ్ళాడు. నీటి చుక్క లేదు. పూర్తిగా ఎండిపోయి కనిపించింది. అతడు కొండ దిగువకు చూస్తే కాలువ పారుతోంది. గురుశిష్యులు ఒక తుమ్మచెట్టు కింద కూర్చుని ఉన్నారు. పట్టరాని ఆగ్రహావేశంతో ఫకీరు తన శక్తినంతా ఉపయోగించి ఒక బండను కిందికి దొర్లించాడు. తమ మీదికి వస్తూన్న బ్రహ్మాండమైన బండను చూసి భీతితో శిష్యుడు కీచుమని అరిచాడు. ప్రశాంతంగా చూస్తూన్న గురువు దేవుణ్ణి కీర్తించమని శిష్యుణ్ణి ఆదేశించాడు. బండ తన దాపులకు రాగానే, యథాలాపంగా చేయి అడ్డంపెట్టి, తన అరచేతితో దాన్ని ఆపాడు. ఈనాటికీ, ఆ బండ మీద గురువు హస్తముద్ర కనిపిస్తుంది. ఆ ప్రదేశంలో 'గురు హస్త' దేవాలయం వెలిసింది. దాని చుట్టూ క్రమంగా పట్టణం ఏర్పడింది. అక్కడ



'పవిత్ర హస్తం' పేరుతో రైల్వే స్టేషన్ కూడా వచ్చింది.''

నేను కథను విని చాలా సంతోషించాను. అయితే, కొండలాంటి బండను గురువు తన హస్తంతో అడ్డుకోవడం అన్నది నమ్మలేకపోయాను. అదే విధంగా బండ మీద హస్తం ముద్ర ఏర్పడడం కూడా విశ్వసించలేక పోయాను. ''అ తరవాత ఎవరో దాన్ని చెక్కి ఉంటారు,'' అని చెప్పి మా అమ్మతో నేను చాలాసేపు ఆ విషయం గురించి వాదించాను.

మా అమ్మ నాకేసి ఒకసారి చూసి మౌనంగా ఉండి పోయింది.

ఆ ఉదంతం ప్రస్తావన వచ్చినప్పుడల్లా, ''కిందికి దొర్లి పడుతూన్న మంచు బండను ఎవరైనా అడ్డుకోగలరా?'' అని ఆవేశంతో ప్రశ్నించే వాణ్ణి. ఆ కథను బడిలో విన్నప్పుడు కూడా ఒప్పుకోకుండా ఉపాధ్యాయుడితో వాదనకు దిగాను.

''నమ్మినవారికి, మహనీయులకు అసాధ్యమన్నది లేదు,'' అని చెప్పి ఉపాధ్యాయుడు నా నోరు మూయించాడు.

ఇది జరిగిన మరి కొన్నాళ్ళకు మరొక భయానకమైన సంఘటన జరిగినట్టు విన్నాను. అటువంటి సందర్భాలలో ప్రజలు ఆతృతకొద్దీ మామూలుగా ఆలయాలకు వెళ్ళి, అసలు జరిగిందేమిటో బాధ్యతాయుతమైన వ్యక్తుల నుంచి వివరాలు అడిగి తెలుసుకుంటూ ఉంటారు. అలా మా అమ్మ కూడా బయలుదేరింది. ఆమె వెంట నేనూ, మా చెల్లెలూ కూడా వెళ్ళాం. దారి పొడవునా మా అమ్మ కళ్ళు చెమ్మగిల్లడం గమనించాను. మేము ఆలయం చేరాక ఒక వింత కథ విన్నాం:

దూరంగా ఉన్న నగరంలో ఒక తెల్లదొర నిరాయుధులైన స్వాతంత్ర్య పోరాటయోధుల గుంపు మీద కాల్పులు జరపమని ఆజ్ఞాపించి వేలాది మందిని హతమార్చాడు. మరణించిన వారిలో యువకులు, పిల్లలు, పెద్దలు, స్త్రీలు పురుషులు ఉన్నారు. చావగా మిగిలిన వారిని బంధించి రైలెక్కించి మరొక నగరంలోని జైలుకు తరలిస్తున్నారు. బందీలైన వారు ఆకలి దప్పులతో అల్లాడిపోతున్నారు. రైలును మార్గమధ్యంలో ఎక్కడా ఆపకూడదన్నది తెల్లదొర ఆజ్ఞ. ఆ వార్త దేవాలయానికి చేరింది. విన్నవారందరూ మండిపోయారు. ఒక శిష్యుడి దాహం తీర్చడానికి అద్భుతాన్ని ప్రదర్శించిన గురువు పేరుతో వెలసిన ఆలయాన్ని దాటుకుని ఒక రైలు నిండుగా మనుషులు ఆకలి దప్పులతో వెళ్ళడమా? ఆ రైలులో క్షతగాత్రులు కూడా ఉన్నారు. తమ స్టేషన్లో రైలు బండి ఆగాలని 'పవిత్ర హస్తం' ఆలయ నిర్వాహకులు అర్థించారు. స్టేషన్ మాస్టర్‌కి లిఖిత పూర్వకంగా తమ విన్నపాన్ని అందించారు. ఫోన్లు చేశారు. టెలిగ్రాములు పంపారు. అయితే, రైలు ఆపడానికి దొరతనం వారు అంగీకరించలేదు. ఆలయంలోని భక్తులు రొట్టెలతో, ఇతర ఆహార పదార్థాలతో, నీళ్ళతో స్టేషన్లోకి వచ్చారు.

రైలు బండ్లు మామూలుగా సుడిగాలిలా స్టేషన్లో ప్రవేశించి, ఉప్పెనల్లా వెళ్ళిపోయేవి. ఎవరైనా సరే రైలును ఎలా ఆపగలరు?

మా అమ్మ స్నేహితురాలు మిగిలిన సంగతి వివరించింది:

''మొట్టమొదటి వ్యక్తిగా మా పిల్లల తండ్రి వెళ్ళి రైలు పట్టాలపై కూర్చున్నాడు. ఆ తరవాత ఆయన స్నేహితులూ, వారి భార్యలూ

వెళ్ళి పట్టాల మీద అడ్డంగా కూర్చున్నారు. దూరంలో రైలు ఇంజను కూత భయంకరంగా వినిపించింది. రైలు స్టేషన్ను సమీపించే సరికి వేగం తగ్గింది కాని, ఎంతయినా రైలు ఉక్కుతో తయారయింది కదా. ఉన్నట్టుండి ఆగలేక, నిలిచేసరికి కొంత సమయం పట్టింది. అంత లోనేరైలు చక్రాలు చాలా మంది మీదికిఎక్కాయి. అయినప్పటికీ, తక్కినవారిలో ఒక్కరు కూడా కూర్చున్న చోటునుంచి లేవలేదు. పట్టాలపై కూర్చున్న మేమందరం కలిసి, ''కీర్తి అంతా భగవంతుడికే! మహిమ అంతా భగవంతు డిదే....'' అంటూ గొంతెత్తి ప్రార్థించాము. రైలు వెనక్కి వెళ్ళింది. ఆ సమయంలో దాని కిందవున్న శరీరాలు ముక్కలు ముక్కలయ్యాయి. రైలు పట్టాలకు రెండు వైపులా రక్తం ప్రవ హించసాగింది.''

ఆ కథ విన్న నేను దిగ్భ్రాంతి చెందాను. ఆ రోజంతా ఒక్క మాట మాట్లాడలేక పోయాను.

ఆ రోజు సాయంకాలం మేము మా గ్రామానికి తిరిగి వస్తూండగా మా చెల్లె లికి మా అమ్మ గురువు హస్తం కథ చెప్పడం ప్రారంభించింది. శిష్యుడితో గురువు రావడం, శిష్యుడు దప్పికతో విలవిలలాడడం, ఫకీరు కొండపై నుంచి బండను దొర్లించడం గురువు భగవంతుణ్ణి స్మరిస్తూ, అడ్డుకోవడం వివరిం చింది. ''బండను అరచేత్తో అడ్డుకోవడం ఎలా సాధ్యం?'' అంటూ అడ్డు తగిలింది మా చెల్లెలు.

''ఎందుకు సాధ్యం కాదు? తుఫానులా దూసుకు వచ్చిన రైలునే ఆపగలిగినప్పుడు, కొండపై నుంచి దొర్లుకు వస్తున్న బండను ఆప లేరా?'' అన్నాను నేను ఆవేశంతో.

మా అమ్మ కళ్ళ నుంచి చెంపల మీదుగా కన్నీళ్ళు కారడం చూశాను.





# స్వాతంత్ర్య సమరం తుది రోజులు

**1857** సిపాయిల తిరుగుబాటు సమయం లోనూ, ఆ తరవాతా జరిగినవి అందరికీ తెలిసినవే. అవన్నీ హింసాత్మక సంఘటనలు. 1920లలో గాంధీజీ స్వాతంత్ర్య పోరాటానికి నాయకత్వం చేపట్టగానే అది అహింసా మార్గంలో సాగుతుందని ప్రకటించాడు.

అయినప్పటికీ చిట్టచివరి తిరుగుబాటు హింసాత్మకంగా పరిణమించింది. 1946 ఫిబ్రవరి 18వ తేదీ బొంబాయిలో మకాం చేసిన 'రాయల్ ఇండియన్ నేవీ'కి చెందిన దాదాపు 1000 మంది, వడ్డించిన ఆహారం బాగా లేదని తినడానికి నిరాకరించారు. మరునాడు బొంబాయి రేవుకు చెందిన దాదాపు 20,000 మంది నావికులు ఓడల మీది 'యూనియన్ జాక్'ను కిందికి లాగి, భారత త్రివర్ణ పతాకను ఎగురవేశారు.

ఫిబ్రవరి 21వ తేదీ ఒక నావికుడు బ్రిటిష్ సైనికుల చేత కాల్చి చంపబడ్డాడు. ఆ తరవాత



సైన్యం ఒక నౌకలోకి జొరబడడంతో గొడవ జరిగి, నలుగురు భారతీయ నావికులు ప్రాణాలు కోల్పోయారు.

ఫిబ్రవరి 22వ తేదీ బొంబాయిలోని దాదాపు 2,00,000 మంది కార్మికులు సానుభూతి సమ్మెకు దిగారు. జరుగుతూన్న సమావేశం మీద బ్రిటిష్ సైనికులు జరిపిన కాల్పుల్లో దాదాపు 250 మంది మరణించారు.

బొంబాయిలోని అధికారులతో కాంగ్రెస్, ముస్లిం లీగ్ పార్టీలు చర్చలు జరిపాయి. తమ పోరాటాన్ని విరమించమని నావికులకు వల్లభాయి పటేల్, మహమ్మదాలీ జిన్నా సంయుక్తంగా విజ్ఞప్తి చేశారు. "మేము ఇండియాకు లొంగిపోతున్నాము. బ్రిటనుకు కాదు," అని ప్రకటించి వాళ్ళు పోరాటాన్ని విరమించారు.

అదే సమయంలో ప్రధానమంత్రి అట్లీ మంత్రిమండలిలోని ముగ్గురు మంత్రులు 'సంపూర్ణ స్వపరిపాలన' మంజూరు చేసే విషయంగా చర్చలు జరపడానికి ఇండియాకు వచ్చారు. మే 16వ తేదీ 'కేబినెట్ మిషన్' ఒక ప్రతిపాదనను ప్రవేశ పెట్టింది. రాజ్యాంగ రచనకు ఒక కమిటీ ఏర్పాటు చేయాలని సూచించింది. ఆ ప్రతిపాదనను కాంగ్రెస్, లీగ్ ఉభయ పార్టీలూ ఆమోదించాయి.

జూన్ 16వ తేదీ వైస్రాయ్ లార్డ్ వావెల్ తాత్కాలిక ప్రభుత్వ ఏర్పాటును ప్రకటిం

చాడు. మంత్రి మండలిలో హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు, పార్సీల నుంచి ఎంపిక చేయబడిన 14 మంది సభ్యులు ఉంటారు. తాత్కాలిక ప్రభుత్వంలో చేరడానికి ముస్లిం లీగ్ తిరస్కరించింది. జిన్నాను సంప్రదించాక పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, ప్రభుత్వ ఏర్పాటుకు సిద్ధంగా ఉన్నట్టు వైస్రాయ్‌కి తెలియజేశాడు. 1946 ఆగస్ట్ 15వ తేదీ తాత్కాలిక ప్రభుత్వ సభ్యులు పదవీ ప్రమాణం చేశారు. పండిట్ నెహ్రూ తాత్కాలిక ప్రధాన మంత్రి అయ్యాడు. అక్టోబర్ 13వ తేదీ, ముస్లిం లీగ్ కూడా తాత్కాలిక ప్రభుత్వంలో చేరుతున్నట్టు జిన్నా ప్రకటించాడు.

డిసెంబర్ 9వ తేదీ తొలి 'కాన్‌స్టిట్యువంట్ అసెంబ్లీ' సమావేశమయింది. ముస్లిం లీగ్‌దానిని బహిష్కరించింది. పాకిస్థాన్‌కు రాజ్యాంగం రూపొందించడానికి ప్రత్యేక కమిటీ ఏర్పాటు చేయాలని జిన్నా కోరాడు.

బెంగాల్‌లోనూ, పంజాబులోనూ దారుణమైన మతఘర్షణలు చెలరేగాయి. దేశవిభజన ద్వారా ఉపఖండంలో శాంతి నెలకొనగలదనుకుంటే అందుకు అంగీకరిస్తున్నట్టు కాంగ్రెస్ మార్చ్ నెలలో ఆఖరికి తన సంసిద్ధతను తెలియజేసింది.

అదే సమయంలో ఫిబ్రవరి 20 తేదీ ప్రధాన మంత్రి అట్లీ, 1948 జూన్‌లోగా అధికార మార్పిడికి ఆయత్తమవుతున్నట్టు పార్లమెంటుకు తెలియజేశాడు. మార్చ్ 24వ తేదీ లార్డ్ మౌంట్‌బాటన్ వైస్రాయ్‌గా పదవీ బాధ్యతలు చేపట్టాడు. పక్షం రోజులలో గాంధీజీతోనూ, జిన్నాతోనూ చర్చలు జరిపాడు. ఆ తరవాత ఇతర నాయకులతోనూ, స్థానిక సంస్థాన పాలకులతోనూ మంతనాలు జరిపాడు. అధికారమార్పిడి ప్రణాళికతో వైస్రాయ్ మేలో లండన్‌కు వెళ్ళాడు.

ఆయన తిరిగి వచ్చి, కాంగ్రెస్, లీగ్ నాయకులతోనూ, శిక్కు సంస్థలతోనూ సమావేశాలు ఏర్పాటు చేశాడు. జూన్ 3వ తేదీ మౌంట్‌బాటన్ ఇండియా, పాకిస్థాన్ ప్రత్యేక దేశాలుగా ఉంటాయని రేడియో ద్వారా ప్రకటించాడు. జూన్ 14వ తేదీ కాంగ్రెస్ మౌంట్‌బాటన్ ప్రతిపాదనను ఆమోదించింది. జూన్ 16వ తేదీ ఇండియన్ ఇండిపెండెన్స్ బిల్లు బ్రిటిష్ పార్లమెంటులో ఆమోదించబడింది.

ఆగస్ట్ 14-15 అర్ధరాత్రి సమయంలో 'కాన్‌స్టిట్యువంట్ అసెంబ్లీ' ఢిల్లీలోని పార్లమెంటు హౌస్‌లో సమావేశమయింది. లార్డ్ మౌంట్‌బాటన్ ఐదవ కింగ్ జార్జ్ పంపిన స్వాతంత్ర సందేశాన్ని చదివాడు. అప్పుడే జవహర్‌లాల్ నెహ్రూ, ''భారతదేశం విధితో చేసుకున్న ఒప్పందం...'' అంటూ చారిత్రాత్మకమైన ఉపన్యాసమిచ్చాడు.

సుదీర్ఘమైన భారత స్వాతంత్ర్య సమరం ఆ అర్ధరాత్రి సమయంలో జయప్రదంగా ముగిసింది!



# సంగాయ్ జింకలు

ఏమండోయ్! నేను మీకు తెలుసా? ఒకవేళ తెలిసినా నన్ను ఏ పేరుతో పిలవాలన్నది మీకు పెద్ద చిక్కే! ఎందుకంటే నాకు బోలెడన్ని పేర్లు! మణిపూర్ వంకర కొమ్ముల జింక అన్నది వాటిలో ఒకటి. మీ కోసం దాన్ని సులభం చేసి చెబుతాను. నన్ను సంగాయ్ అని పిలవండి చాలు.

నిన్నగాక మొన్నేమో ఒకాయన నన్ను చూసి, "అదిగో వెళుతోంది చూడండి. అది చాలా అరుదైన, నశించిపోయే స్థితిలో వున్న సంగాయ్," అని పక్కనున్న వారికి చెప్పడం విన్నాను.

నేనూ, నా స్నేహితుడూ ఈశాన్య భారత దేశంలో పుట్టి ఒకటిగా పెరిగి పెద్దవాళ్ళయ్యాం. మణిపూర్ గురించి మీరు వినే వుంటారు. ఇక్కడ లోక్‌టాక్ అనే పెద్ద సరస్సు ఉంది. దీనికి దక్షిణంగానే కీయ్‌బుల్ లామ్‌జావో నేషనల్ పార్క్ ఉంది. ప్రపంచం మొత్తం మీద అదొక్కటే ఫ్లోటింగ్ నేషనల్ పార్క్. అంటే, తేలే జాతీయోద్యానం అని చెప్పవచ్చు. అదే మా నివాస స్థలం-తేలేస్వస్థలం అన్నమాట. అదేంటి తేలే నివాసం అంటారా? చెబుతాను వినండి.

లోక్‌టాక్ సరస్సు ఒక భాగంలోనూ, నేషనల్ పార్క్‌లోనూ పుమ్‌డీస్ అనే దీవులు కొన్ని ఉన్నాయి. ఈ దీవుల ఐదోవంతు నేల మాత్రం పైకి తేలుతూ, తక్కినది నీళ్ళ అడుగున మునిగి ఉంటుంది. అందువల్ల ఈ దీవులు నీళ్ళపై తేలుతున్నట్టు కనిపిస్తాయి. ఈ దీవుల నేలభాగం సారవంతమైనది కావడంతో చెట్టు చేమలు విరివిగా ఉన్నాయి. ఈ పుమ్‌డీస్‌లో నేను నడుస్తూంటే, నాట్యం చేస్తున్నట్టు ఉంటుందట. అందుకే నన్ను నాట్యం చేసే జింక అని అంటారు.

ఒకనాడు నా మిత్రుడూ, నేనూ కలిసి మా తేలేనివాసస్థానంలో జరుగుతూన్న కొన్ని వింత విషయాలను గురించి చర్చించడానికి సరస్సు సమీపానికి వెళ్ళాం. కొన్ని సంవత్సరాల క్రితం



ఈ శతాబ్దారంభంలో కీయ్‌బుల్ లామ్‌జావో నేషనల్ పార్కులో 162 సంగాయ్ జింకలు ఉండేవి. అరుదైన ఈ జాతి జింకలు నివసించే విలక్షణమైన దీవులు 40.5 చ.కి.మీ. విస్తరించి ఉన్నాయి. వీటిలో ముఖ్యంగా 15 చ కి.మీ. విస్తర్ణంలోనే ఇవి ఎక్కువగా తిరుగుతూ ఉంటాయి. ఈ దీవులను స్థానికులు 'ఫుండీ'లని పిలుస్తారు. ఈ నేషనల్ పార్కులోనే కాకుండా ఇంఫాల్‌లోని ఐరోయిషెంబా జూ లోనూ, లాంగోల్‌లోని సంగాయ్ కేప్టివ్ బ్రీడింగ్ సెంటర్ లోనూ సంగాయ్ జింకలు ఉన్నాయి.

ఇక్కడ నిర్మించిన బ్రహ్మాండమైన కాంక్రీటు ఆనకట్ట, కృత్రిమ తటాకాలే వీటికన్నిటికీ కారణం అని నాకు తెలుసు. అవి ఏర్పడ్డాక మా దీవులు సన్నబడి చిక్కి పోయాయని మేము గ్రహించాం. కృత్రిమ తటాకం నుంచి తరచూ వెల్లువలు వస్తూంటే అవి త్వరలో మునిగిపోయే ప్రమాదమూ పొంచివుంది.

మేము మాట్లాడుకుంటూన్నప్పుడు కుక్కలు మొరగడం వినిపించింది. దాపులనున్న గ్రామం నుంచి ఆ శబ్దం వస్తున్నదనుకున్నాం. కాని కొంత సేపటికే ఆ శబ్దం మరింత దిగ్గరగా వినిపించసాగింది.

''పరిగెత్తు, పరిగెత్తు, అవి మనల్ని చంపడానికి వస్తున్నాయి!'' అని అరుస్తూ నా మిత్రుడు ముందు పరిగెత్తసాగాడు. నేనూ లేచి పరుగు పట్టాను. క్షణంలో నా మిత్రుడికన్నా ముందుకు వెళ్ళాను. అతడు కొద్దిగా వెనకబడ్డాడు: నేను నా శక్తినంతా కూడదీసుకుని పరిగెత్తుతున్నాను. కానీ, నా వెనకే కుక్కలు మొరగడం వినిపిస్తున్నది. ఉన్నట్టుండి నా తల వాలుగా ఉన్న ఒక చెట్టుకొమ్మకు కొట్టుకోవడంతో దభీమని కింద పడ్డాను. స్పృహ కోల్పోయినంత పనయింది. కొంతసేపటికి లేచి చూస్తే, నా చుట్టూ చాలా మంది జనం ఉన్నారు. తలనొప్పిగా ఉంది. నా మిత్రుడి కోసం చూశాను. కనిపించలేదు. కఠినాత్ములైన వేటగాళ్ళు, వలవేసి సంగాయ్ జింకను చంపేశారని నా చుట్టూవున్నవాళ్ళు చెప్పుకుంటున్నారు. నాకు వెంటనే నా మిత్రుడు జ్ఞాపకం వచ్చాడు. వేటగాళ్ళు చంపింది అతన్ని కాదు కదా! నాకు ఏడుపు ఆగలేదు. చావడానికి ఇప్పుడు నా వంతు వచ్చిందా ఏం? నా కళ్ళల్లో నీళ్ళు నిండాయి. అప్పుడే నా మిత్రుడు నన్ను పిలవడం వినిపించింది. చటుక్కున లేచి నిలబడ్డాను. చుట్టూ ఉన్న జనం ఉలిక్కి పడ్డారు. పక్కకు జరిగి నేను వెళ్ళడానికి దారి ఇచ్చారు. ముందుకు వెళ్ళి నా ముఖాన్ని నా మిత్రుడి ముఖానికి సంతోషంగా రుద్దాను. నేను తప్పించుకుని పారిపోయి వచ్చాక ఏం జరిగిందని అడిగాను.

అ కుక్కలు పట్టుకుని దాదాపు తనను చంపేశాయని చెప్పిన నా మిత్రుడు, ''అవి చాలా భయంకరమైనవి, తండ్రీ,'' అన్నాడు. ''మరి, ఇంకా నువ్వెలా ప్రాణంతో ఉన్నావు,'' అని అడిగాను దిగ్భ్రాంతితో.

''ఇదో ఈ సమీపంలో నివసించే కుర్రాళ్ళే కాపాడారు,'' అన్నాడు నా మిత్రుడు.

నేనెంతో సంతోషించి, మా ప్రాణాలను కాపాడినందుకు వారికి మేమెంతో రుణపడి ఉన్నట్టు భావించాను. ఇక్కడివారికి సంగాయ్ జింకలంటే ఎంతో ఇష్టపడతారని నా మిత్రుడు చెప్పాడు. సంగాయ్‌లను చంపడం క్షమించ రాని పాపంగా వాళ్ళు విశ్వసిస్తారట. సంగాయ్‌లను మనుషులకూ, ప్రకృతికీ మధ్య వారధులుగా చెప్పే మణిపురి పూర్వగాథ ఒకటి ఉన్నది. అందువల్ల మమ్మల్ని చంపడం అంటే ప్రకృతితో బంధాన్ని తెంచుకోవడమే అవుతుంది. మాలాంటి జంతువుల క్షేమంపట్ల శ్రద్ధగల వాళ్ళందరూ కలిసి ఒక బృందంగా ఏర్పడ్డారని కూడా నా మిత్రుడు చెప్పాడు. జంతువులను పరిరక్షించే విధానాలను కూడా వాళ్ళు ఇతరులకు బోధిస్తారు.

నాలాంటి జింకలనూ, ఫుమ్‌డీస్‌నూ, లోక్‌టాక్ సరస్సునూ పరిరక్షించడానికి ప్రజలు తమ శాయశక్తులా కృషిచేస్తున్నారనే వార్త నాకెంతో ఊరట కలిగిస్తోంది. నాలో కొత్త విశ్వాసాన్ని నింపుతోంది. ''వాళ్ళెంత మంచి వాళ్ళో కదా!'' అనుకుంటూ ఉంటాను. సరే, చీకటిపడుతోంది. నేనూ, నా మిత్రుడూ మా మందకు తిరిగి వెళ్ళాలి. మేము తిరిగి వెళుతూంటే మా నాట్యం లాంటి నడక చూసి ఇక్కడ ఉన్న వాళ్ళందరూ ఆనందించవచ్చు. మిమ్మల్ని నేను మళ్ళీ కలుసుకోగలిగితే అది చాలా గొప్ప విషయం. మీరు గనక మరెప్పుడైనా ఇక్కడికి వస్తే, కీయ్‌బూలామ్‌జావో నేషనల్ పార్కులో మనం ఒకటిగా నాట్యం చేయవచ్చు! – కాంచీ కోహ్లీ

## మన దేశం క్విజ్

60 సంవత్సరాల క్రితం మనదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. ఈ నెల క్విజ్‌లో స్వాతంత్ర్య పోరాటానికి సంబంధించిన కొన్ని ప్రశ్నలు చూద్దాం.

1. గాంధీజీకి ముందు స్వాతంత్ర్య పోరాటానికి నాయకత్వం వహించినవారెవరు?
2. గాంధీజీ మొట్టమొదట ఎప్పుడు ఎక్కడ ఖైదుచేయబడ్డాడు?



3. 'జై హింద్' నినాదాన్ని అందించిన వారెవరు?
4. కాంగ్రెస్ పార్టీ ప్రతినిధిగా గాంధీజీ లండన్‌లో పాల్గొన్న రౌండ్ టేబుల్ సమావేశం ఏది?
5. పంజాబు, బెంగాల్ రాష్ట్రాల నుంచి వచ్చిన ఇద్దరు ప్రముఖ విప్లవకారులెవరు?

(సమాధానాలు 66వ పేజీలో)

# చందమామ కబుర్లు



## తాజ్ మహల్ చుట్టూ పసుపురంగు తెర

ఇదేదో తాజ్ మహల్‌కు రక్షణ ఏర్పాటు అనుకుంటే పొరబడినట్టే. ఈ సహస్రాబ్దపు 'కొత్త' ఏడు వింతలలో ఒకటిగా స్థానం సంపాదించుకున్న అద్భుత భవనం తాజ్ మహల్. ఆగ్రాలోనూ, చుట్టు పక్కలా ఉన్న పరిశ్రమల నుంచి వెలువడుతూన్న కాలుష్యాలైన సల్ఫర్‌డైయాక్సైడ్, నైట్రస్ ఆక్సైడ్ వాయువులు దీని చుట్టూ పసుపు తెరలా ఏర్పడుతున్నవి. అందువల్ల తాజ్ మెల్లమెల్లగా తన తెల్లటి మెరుపును కోల్పోతున్నది. ఒకనాటి తెల్ల పాలరాతి కాంతి కనిపించడం లేదు. ఈ విషయం పార్లమెంటరీ కమిటీ నివేదికలో వెల్లడయింది. ఈ భవన పరిరక్షణను పర్యవేక్షిస్తున్న ఆర్కియాలాజికల్ సొసైటీ ఆఫ్ ఇండియాను, తక్షణమే పరిరక్షణ చర్యలను చేపట్టమని పార్లమెంటరీ కమిటీ ఆదేశించింది.

## సముద్ర గర్భంలో 500 మిలియన్ డాలర్లు

దాదాపు 400 సం.లకు పూర్వం అట్లాంటిక్ సముద్రంలో మునిగిపోయిందని భావించబడే ఓడ నుంచి 50,000 వెండి, బంగారు నాణాలు ఇటీవల 'సముద్ర గర్భశోధకు'లకు లభించాయి. ఇంతవరకు ఇలా లభించిన వాటిలో దీనినే అత్యధిక నిధిగా చెబుతున్నారు. ఈ నాణాల బరువు 17 టన్నులు; విలువ 500 మిలియన్ డాలర్లు. 1985లో నీస్ట్రానోరా డీ అటోచా అనే స్పానిష్ యుద్ధనావలో లభించిన 400 మిలియన్ డాలర్లనే ఇంతకు ముందు అధిక మొత్తంగా పేర్కొనేవారు. 2007 మే నెలలో అమెరికాకు చెందిన 'ఒడిస్సీ మెరీన్ ఎక్స్‌ప్లోరేషన్' కంపెనీ ఈ నిధిని కనుగొని ఫ్లోరిడాలోని తంపాకు విమానం ద్వారా తరలించింది. ఈ నాణాలు ఏ దేశానికి చెందినవి, మునిగి పోయిన ఓడ ఏది, ఏ ప్రదేశంలో లభించాయి అన్న వివరాలను మాత్రం కంపెనీ బయటపెట్టలేదు.





# రాజైన మావటివాడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు వారణాసినగర సమీపంలో సాధువుగా జీవిస్తూండేవాడు. ఆయన ఒకనాడు భిక్షకోసం నగరానికి వచ్చి, ఒక మావటివాడి ఇంటికి వెళ్ళాడు. వాడు ఏనుగులకు శిక్షణ ఇవ్వడంలో చాలా సమర్థుడు, రాజు కొలువులో వుండేవాడు.

మావటివాడు బోధిసత్వుణ్ణి భక్తిపూర్వకంగా ఇంట్లోకి తీసుకుపోయి, భోజనం పెట్టాడు. తరవాత ఆయనతో వినయంగా, ''తమరు కొద్ది రోజుల పాటైనా, నా ఇంట వుండవలసిందిగా ప్రార్థిస్తున్నాను,'' అన్నాడు.

బోధిసత్వుడు, మావటివాడి ఇంట వారం రోజులపాటు అతిథిగా వుండి, వెళ్ళిపోయేటప్పుడు, అతడి మేలు కోరుతూ దీవించాడు.

ఒకనాటి రాత్రి నగరంలోని ఒక దేవాలయ మండపం మీద, కట్టెలు కొట్టి జీవించేవాడొకడు పడుకున్నాడు. దాపుల నున్న ఒక చెట్టు కొమ్మల్లో కొన్ని కోళ్ళు నిద్రపోతున్నవి. చెట్టు కింద ఏదో శబ్దం కాగా, కోడిపుంజొకటి మేల్కొని గట్టిగా రెక్కలాడించింది. అప్పుడొక ఎండు పుల్ల విరిగి, కింద కొమ్మపై నిద్ర పోతున్న మరొక కోడిపుంజు మీద పడడంతో, దానికి నిద్రాభంగమయింది.

కోడిపుంజు కోపంగా తల ఎత్తి పైకి చూస్తూ, ''అంత పొగరుబోతుతనం మంచిదికాదు! నేనెవరనుకుంటున్నావు? నేను మామూలు కోడినికాదు. నా మాంసం తిన్నవాడికెవడికైనా గొప్ప నిధి దొరికి తీరుతుంది,'' అన్నది.

ఆ మాటకు పైకొమ్మ మీద వున్న కోడిపుంజు కెకకెకమంటూ నవ్వి, ''నా గొప్పతనం నీకేం తెలుసు! నా మాంసం తిన్నవాడు తప్పక రాజవుతాడు,'' అంటూ రహస్యం బయట పెట్టింది.

ఈ సంభాషణ విన్న కట్టెలు కొట్టేవాడు పరమానందం చెందాడు. వాడు కొంతసేపు

జాతక కథ

వేచివుండి, కోళ్ళు తిరిగి నిద్రపోతున్నవని తెలుసుకుని, నిశ్శబ్దంగా చెట్టు మీదికి పాకి పోయాడు. తాను రాజే కాగలిగినప్పుడు, నిధులతో పనేమనిపించింది వాడికి. ఆ కారణం వల్ల వాడు కింద కొమ్మ మీద వున్న కోడి పుంజును వదిలి, పైకొమ్మ మీద వున్న కోడి పుంజును పట్టుకుని చెట్టు దిగి, ఇంటికి బయలుదేరాడు. వాడు ఇల్లు చేరుతూనే భార్యను పిలిచి, ''ఈ సంగతి తెలుసా? నువ్వు రాణివి కాబోతున్నావు!'' అన్నాడు.

వాడి భార్య కోపంగా, ''మతిలేని కబుర్లు చెప్పకు. నేను కట్టెలు కొట్టుకుబతికేవాడి పెళ్ళాన్ని,'' అన్నది.

కట్టెలు కొట్టేవాడు పెద్దగా నవ్వి, ''కట్టెలు కొట్టుకు జీవించే నీ భర్త, సింహాసనం ఎక్కబోతున్నాడు! ఇదుగో, ముందు ఈ కోడిని కోసి వండు,'' అని భార్యకు, తాను తెచ్చిన కోడి మాంసానికున్న మహత్తును గురించి చెప్పాడు.

వాడి భార్యకు కలిగిన సంతోషం అంతా ఇంతా కాదు. ఆవిడ అప్పటికప్పుడే కోడిని కోసి వండింది. ''మనం ముందు నదిలో స్నానం చేసి, తరవాత భోజనం చేద్దాం,'' అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

ఇద్దరూ కొంత అన్నంతోపాటు, కోడి మాంసాన్ని ఒక చిన్న కుండలో పెట్టి, దానికి మూత బిగించి తీసుకుని, నది దగ్గిరకు వెళ్ళారు. కుండను నది గట్టుమీద పెట్టి, స్నానం చేసేందుకు నదిలోకి దిగారు. చూస్తూండగానే నది పొంగింది, ఆ ప్రవాహవేగంలో గట్టుమీద పెట్టిన కుండ కొట్టుకుపోయింది.



కట్టెలు కొట్టేవాడు తల బాదుకుంటూ, ''నేను రాజూ, నువ్వు రాణీ అయ్యే అదృష్టం లేదు; ఏం చేస్తాం!'' అన్నాడు.

ఇద్దరూ దుఃఖిస్తూ ఇంటిదారి పట్టారు.

ఆ సమయంలో నదికి చాలా దిగువున, బోధిసత్వుడికి ఆతిథ్యం ఇచ్చిన మావటివాడు, ఒక ఏనుగును నదిలో కడుగుతున్నాడు. వాడికి నీటివాలునపడి కొట్టుకు వస్తున్న కుండ కంటబడింది. వాడు దాన్ని పట్టుకుని, మూత విప్పిచూడగా, అప్పుడే వండిన మాంసం, అన్నం కనిపించినై. వాడు ఆశ్చర్యపోయాడు. బాగా ఆకలి గొనివుండడంతో మావటివాడు అప్పటికప్పుడే దొరికిన ఆహారాన్ని తిన్నాడు.

ఇది జరిగిన మూడవ రోజున వారణాసి పైకి శత్రుసైన్యం దండెత్తి వచ్చింది. రాజు, తాను మావటివాడుగా వేషం వేసుకుని, మావటి

వాడికి రాజోచితమైన దుస్తులూ, ఇతర అలం కరణలూ చేశాడు. మావటివాడి వేషంలో తనకు శత్రువుల నుంచి ప్రమాదం జరగదని ఆయన భావించాడు.

దండెత్తి వచ్చిన శత్రువులు రాజును ప్రాణాలతో పట్టుకోవాలని పథకం వేశారు. వాళ్ళు మావటివాణ్ణి చంపి, అంబారీలో వున్న రాజును బంధించేందుకు మావటివాడిపై బాణాలు కొట్టసాగారు. వాళ్ళకు మావటివాడి వేషంలో వున్నవాడు రాజని తెలియదు.

శత్రువులు వదిలిన బాణాలు తగిలి, మావటివాడి వేషంలో వున్న రాజు మరణిం చాడు. మావటివాడికి శత్రువుల ఎత్తుగడ అర్థమైంది. వాడు యుద్ధరంగం నుంచి పారి పోక, పగతీర్చుకోవాలన్న పట్టుదలతో శత్రువు లను ఎదిరించి భయంకరంగా పోరాడసాగాడు.

ఇది వారణాసి సైనికులకు ఎక్కడ లేని ధైర్యాన్ని కలిగించింది. వాళ్ళు ఆకలిగొన్న సింహాల్లా శత్రుసైనికుల మీది కురికారు. కొద్ది సేపట్లో చచ్చినవాళ్ళు చావగా, మిగిలిన శత్రుసైనికులు యుద్ధరంగం మావటివాడి ఈటెపోట్లకు అక్కడికక్కడే మరణించారు.

యుద్ధం ముగిసింది. శత్రువులపై తమ విజయానికి కారణం, తమ రాజు కాదనీ, ఆయన మావటివాడనీ, మంత్రులూ, ఇతర రాజోద్యోగులూ తెలుసుకున్నారు. రాజు మర ణించాడు గనక, ఆ స్థానంలో మరొక రాజు అవసరం వున్నది. మరణించిన రాజుకు పిల్లలు లేరు.

రాజుగారి ప్రధాన పౌరోహితుడు, ''రాజు గారే స్వయంగా తన దుస్తులూ, కిరీటం మావటివాడికి ఇచ్చాడు. కనక, మనకు రాజు కాదగినవాడు మావటివాడే!'' అన్నాడు.

''ఆ మాట నిజం! మావటివాడిపరాక్రమం వల్లనే శత్రువులు ఓడి, వారణాసి రక్షించ బడింది. కనక, మావటివాడే సింహాసనానికి న్యాయమైన హక్కుదారు,'' అన్నాడు ప్రధాన మంత్రి.

పౌరోహితుడూ, ప్రధానమంత్రీ చెప్పిన దానికి సేనానాయకులూ, ఇతర ప్రధానోద్యో గులూ; తమ ఆమోదం తెలిపారు.

ఈ విధంగా మావటివాడు రాజయ్యాడు. అతడు కోరిన మీదట బోధిసత్త్వుడు ప్రధాన సలహాదారుగా ఉండేందుకు అంగీకరించాడు.





# రామాయణం

ఆ మాయలేడిని చూస్తుంటే రాముడికి కూడా సీతకు కలిగినట్టే దాని పైన భ్రమ పుట్టుకొచ్చింది. అతను లక్ష్మణుడితో, ''నువ్వూ, జటాయువూ సీతను చూసుకోండి. నేను ఈ లేడిని పట్టి తెస్తాను,'' అని కత్తి, విల్లంబులూ పుచ్చుకుని బయలుదేరాడు.

మారీచుడు తన పని శక్తి వంచన లేకుండా నిర్వహించాడు. అతను లేడి రూపంలో కనిపిస్తూ, మాయమవుతూ, ఒక సారి దూరమవుతూ, ఒకసారి దగ్గరలోనే ఉంటూ రాముణ్ణి ఆశ్రమం నుంచి చాలా దూరం తీసుకుపోయాడు. ఇక ఆ లేడి తనకు ప్రాణాలతో చిక్కదని తోచి రాముడు ఒక తీవ్రమైన బాణం ఎక్కుపెట్టి ఆ లేడి గుండెలో దూసుకుపోయేటట్టు కొట్టాడు. మారీచుడు వెంటనే లేడి రూపు వదిలి తన రాక్షసరూపుతో కిందపడిపోతూ, ''అయ్యో! సీతా! లక్ష్మణా!'' అని రాముడి గొంతుతో అరిచి ప్రాణాలు వదిలాడు. ఆ అరుపు రాముడి చెవికి అశుభంగా తోచింది. మాయలేడి మారీచుడే!

అస్పష్టమైన భయాలు మనసును ఆవరించగా రాముడు మరొక లేడిని చంపి, దాని మాంసం తీసుకుని వేగంగా తమ పర్ణశాల కేసి నడవసాగాడు.

''లక్ష్మణా, అది నీ అన్న చేసిన ఆర్తనాదం. నా కేమో భయంగా ఉంది. నువ్వు వెంటనే వెళ్ళి రాముణ్ణి కాపాడు,'' అన్నది సీత ఆశ్రమంలో.

సీత ఎంతగా విలవిలలాడుతున్నప్పటికీ చలించక లక్ష్మణుడు, ''దేవ మానవ గంధర్వ

అరణ్యకాండ – 5



రాక్షసులలో అన్నను భయపెట్టగలవారెవరూ లేరు. ఇది రాక్షస మాయ. అన్న నన్ను నీకు తోడుగా ఉండమన్నాడు. నేను వెళ్ళను,'' అన్నాడు.

''ఆయన ఆపదలో ఉంటేకూడా పోనం టావే, నువ్వాయనకు మిత్రుడవా, శత్రుడవా? నువ్వు కోరేది రాముడి నాశనం లాగుందే! రాముడికి నిజంగా ఆపదే కలిగితే నేను మరు క్షణం నశిస్తాను. నన్ను నీవు రక్షించేదేమిటి?'' అన్నది సీత.

లక్ష్మణుడు ఎన్నో విధాల సీత భయాన్నీ, అనుమానాన్నీ పోగొట్ట యత్నించాడు. కాని అతని ప్రయత్నం ఫలించలేదు. ఆమె అతన్ని బాగా ఎత్తి పొడిచింది.

చివరకు లక్ష్మణుడు చిరాకుపడి, ''అన రాని మాటలనటం స్త్రీలకు సహజమే. నన్నిన్ని మాటలన్నందుకు నీకు కీడు తప్పదు. నేను వెళ్ళినాక నీకు దేవతలే దిక్కు,'' అంటూ అయిష్టంగా అన్న కోసం బయలుదేరాడు.

అతను అలా వెళ్ళాడో లేదో, రావణుడు సన్యాసి రూపంలో ఒంటరిగా ఉన్న సీత వద్దకు వచ్చాడు. అతను సన్నని కాషాయ వస్త్రం ధరించి, గొడుగు వేసుకుని, పావుకోళ్ళు కాళ్ళకు ధరించి, దండానికి కమండలం తగిలించి ఎడమ భుజానికి ఆన్చి, వేదాలు చదువుతూ వచ్చి, కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్న సీతను పరిశీలించి చూశాడు. ఆమె పచ్చని పట్టుచీర కట్టుకొని ఉన్నది. ఆమె మెడలోని రత్నహారాలు మెరుస్తున్నాయి. రావ ణుడు సీతను పలకరించి, ''అమ్మాయీ, నీ వెవరు? పార్వతివా? అప్సరవా? లక్ష్మీదేవివా? కాంతిదేవతవా? మానవ దేవ యక్ష కిన్నర గంధర్వులలో నీ వంటి సుందరిని నేనెన్నడూ చూడలేదు. ఇంత సుకుమారివి, సుందరివి, చిన్నదానివి ఈ రాక్షస మయమైన చోట ఏం చేస్తున్నావు? ఒంటరిగా ఎందుకున్నావు?'' అని అడిగాడు.

సీత రావణుణ్ణి చూసి నిజమైన సన్యాసి అనుకుని అర్ఘ్యపాద్యాదులిచ్చి అతిథి సత్కా రాలు చేసి, పీట వేసి, వంట సిద్ధంగా ఉన్నది, భోజనం చెయ్యమని ఆహ్వానించింది. ఆమె ఆ సన్యాసి అడిగిన ప్రశ్నలకు సమాధానం చెబుతూ, తన వివాహం జరగటమూ, తాను పన్నెండేళ్ళు కాపురం చేసిన అనంతరం తన మామగారు తన భర్తకు పట్టాభిషేకం తల పెట్టటమూ, కైకేయి ఆ ప్రయత్నాన్ని భగ్నం

చేసి తన భర్తను అడవులకు పంపటమూ. మొదలైన వృత్తాంత మంతా చెప్పింది. అంతా చెప్పి ఆమె రావణుణ్ణి, ''మీ పేరేమిటి? గోత్రమేమిటి? మీరీ దండకారణ్యంలో ఒంటిగా ఎందుకు తిరుగుతున్నారు?'' అని అడిగింది.

సీత ఈ ప్రశ్న అడగగానే రావణుడు, ''నేను రాక్షసరాజును, రావణుణ్ణి. నాకు ఎందరో భార్యలున్నారు గాని, ఒక్కరూ నీతో సమానం కారు. నేనుండే లంకా పట్టణం సముద్రం మధ్య ఎత్తయిన పర్వతం మీద ఉన్నది. ఈ అరణ్యం వదిలిపెట్టి నాతో వచ్చెయ్యి. ఉద్యాన వనాలలో విహరింతాం. నీకు అయిదువేల మంది దాసీలను ఏర్పాటు చేస్తాను,'' అన్నాడు.

ఈ మాటలు విని సీత భయపడటానికి బదులు మండిపడింది. రావణుణ్ణి తిట్టింది, బెదిరించింది. రాముడి పరాక్రమం వివరించింది. అంతా విని రావణుడు తన పరాక్రమం చెప్పుకున్నాడు. తాను కుబేరుడి తమ్ముణ్ణనీ, కుబేరుడి పుష్పక విమానాన్ని లాక్కొన్నాననీ, తన పేరు చెబితేనే సమస్త దేవతలూ భయపడతారనీ అన్నాడు. రాముడు అసమర్థుడు గనకనే రాజ్యం వదిలిపెట్టి అడవులలో అష్టకష్టాలూ పడుతున్నాడన్నాడు. ''నువ్వు రాముడికి భయపడి నాతో వచ్చెయ్యటానికి జంకుతున్నావేమో, నా వెంట ఉన్న నిన్ను రాముడేమీ చేయలేడు. అతడు నా గోటికి చాలడు,'' అన్నాడు.

''కుబేరుడి తమ్ముణ్ణని చెప్పుకుంటూ ఇలాటి పాపపు బుద్ధు లేమిటి? నీకీ పరస్త్రీ వాంఛ పోకపోతే నువ్వూ, నీ రాక్షసులూ నాశనం కాక తప్పదు,'' అన్నది సీత.





రావణుడు మండిపడి చేతులు చరిచి తన నిజ రూపం ధరించి భయంకరంగా సీత ఎదుట ప్రత్యక్షమయ్యాడు. అతని కళ్ళు చింత నిప్పుల్లాగున్నాయి, శరీరం నల్లగా ఉన్నది. చెవులకు బంగారు పోగులున్నాయి. అతను సీతతో, ''పిచ్చిదానా, నీకు నా కన్న ఖ్యాతి గల భర్త ఎక్కడ దొరుకుతాడు? ఇప్పుడు నన్ను నిరాకరించి తరవాత పశ్చాత్తాప పడతావు,'' అంటూ ఆమెను పట్టుకుని రథంలోకి ఎక్కించి, రథంతో సహా పైకి ఎగిరాడు. సీత రాముణ్ణి కేక పెట్టింది, లక్ష్మణుణ్ణి పిలిచింది. ''రావణుడు సీతను ఎత్తుకు పోయినాడని రాముడితో చెప్పండి,'' అని చెట్లతో మొరపెట్టుకున్నది.

ఇంతలో ఒక చెట్టు పైన సీతకు జటాయువు కనిపించాడు.

సీత జటాయువుతో దీనంగా, ''నాయనా, జటాయూ! నన్నీ రాక్షసుడు బలాత్కారంగా తీసుకు పోతున్నాడు. ఈ మాట రాముడికి చెప్పు,'' అన్నది.

చెట్టు మీద కునికిపాట్లు పడుతున్న జటాయువు, ఈ మాటలకు ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూసి రావణుడితో ఇలా అన్నాడు:

''రావణా, నువ్వు చేసేది చాలా తప్పు పని. మామూలు మనుషులు తమ భార్యలను పర పురుషుల నుంచి ఎలా కాపాడుకుంటారో రాజైనవాడు ఇతరుల భార్యలను కూడా అలా కాపాడాలి. నేను సౌమ్యుణ్ణి, వృద్ధుణ్ణి, నిరాయుధుణ్ణి. నువ్వు యువకుడివి, ఆయుధాలు కలవాడివి. అయినా నిన్ను సీత నెత్తుకు పోనివ్వను. రామలక్ష్మణులు దూరాన ఉన్నప్పుడు పిరికిగా నీవీ పని చేస్తున్నావు.''

ఈ మాట లంటూనే జటాయువు రావణు డిపై తలపడ్డాడు. రావణుడు తన రథంలో ఉండి ధనుర్బాణాలతో పోరాడుతుంటే మహా బలశాలి అయిన జటాయువు తన గోళ్ళ తోనూ, కాళ్ళతోనూ, ముక్కుతోనూ కలియ బడి రావణుడి కవచాన్ని నిర్మూలించాడు. అతని శరీరాన్ని చీరాడు, అతని ధనువులను విరిచాడు, రథపు గాడిదలనూ, సారథినీ కూడా చంపాడు. చివరకు రథాన్నే విరిచాడు.

రావణుడు విరథుడై సీతను ఎత్తుకుని భూమి పైకి దిగవలిసి వచ్చింది. ఇంత చేసిన మీదట జటాయువు అలిసి పోయాడు. అది గమనించి రావణుడు సీతతో సహా మళ్ళీ ఆకాశానికి ఎగిరాడు. కాని జటాయువు ఎగిరి వెళ్ళి రావణుడికి అడ్డు తగిలాడు. అతను రావణుడితో, ''ఛీ,ఛీ! నువ్వు వీరుడివి కావు, పిరికిపందవు. వీరుడివైతే రామలక్ష్మణులు వచ్చినదాకా ఉండి వారితో యుద్ధం చెయ్యి,'' అన్నాడు.

రావణుడు వినిపించుకోక ముందుకు సాగిపోయాడు. జటాయువు రావణుడి వెన్నంటి, అతని వీపుమీద వాలి తన గోళ్ళతో గీరసాగాడు, రావణుడి వెంట్రుకలు పీకాడు. రావణుడు మండిపడి సీతను నేలపై దించి జటాయువుతో కలియబడ్డాడు. చివరకు రావణుడు కత్తి దూసి జటాయువు రెక్కలూ, పక్కలూ, పాదాలూ నరికేశాడు. జటాయువు కొన ఊపిరితో నేల మీద పడిపోయాడు.

సీత వలవలా ఏడుస్తూ జటాయువు దగ్గ రికి పరిగెత్తింది. జటాయువును కౌగలించు



కుని భోరున ఏడ్చింది. ''రామా, లక్ష్మణా! ఇప్పుడన్నా వచ్చి నన్ను రక్షించండి!'' అని కేక పెట్టింది. రావణుడు తన కేసి రావటం చూసి సీత లతలను పట్టుకునీ, చెట్లను పట్టుకునీ వేళ్ళాడింది.

''చాలించు ఈ వేషాలు,'' అంటూ రావణుడు ఆమె నెత్తుకుని తిరిగీ ఆకాశ గమనం సాగించాడు.

రావణుడు అతివేగంగా పోతూంటే సీత యొక్క ఆభరణాలు కొన్ని భూమి మీద పడి పోయాయి. సీత రావణుణ్ణి పిరికివాడని అవమానించింది, దొంగ అన్నది, తిట్టింది, ఇప్పటికైనా తనను వదిలేస్తే రాముడు క్షమిస్తాడని ఆశ పెట్టింది; ''ఏది కోరి నన్ను ఇలా తీసుకు పోతున్నావో అది నీకు ఒనగూడదు; ఎందుచేతనంటే నేను రాముణ్ణి విడిచి ఎంతో కాలం బతకను,'' అని కూడా చెప్పి చూసింది. రావణుడీ మాటలేవీ పట్టించుకోలేదు.

ఆకాశంలో పోతున్న సీతకు ఒక కొండ శిఖరం మీద అయిదుగురు వానరులు కనిపించారు. ''వీరు నా సంగతి రాముడితో ఒక వేళ చెబుతారేమో,'' అనుకుని సీత తన పసుపుపచ్చని పైబట్టలో తన ఆభరణాలు కట్టి ఆ వానరుల మధ్య పడేలాగా వేసింది. ఈ సంగతి రావణుడు గమనించలేదు. కాని వానరులు మాత్రం సీతను చాలాసేపు కళ్ళార్పకుండా చూస్తూ ఉండిపోయారు.

రావణుడు పంపా సరస్సు దాటి, సముద్రాన్ని చేరి, దాన్నికూడా దాటి తనపాలిటి మృత్యువైన సీతతో సహా లంకను చేరాడు.

లంకాపురం అతి అందమైన నగరం. అక్కడి రాజమార్గాలు తీర్చిదిద్దినట్టుగా ఉంటాయి. అనేక ప్రాకారాలతో కూడి ఉన్న అంతఃపురంలోకి రావణుడు సీతతో సహా ప్రవేశించాడు. అతను భయంకరాకారాలు గల అక్కడి రాక్షస స్త్రీలను పిలిచి, ''నా అనుమతి లేకుండా ఒక పురుషుడు గాని, స్త్రీగాని ఈ సీతను చూడరాదు. ముత్యాలో, రత్నాలో, బంగారమో, బట్టలో - ఈమె ఏమి కోరితే అది ఎల్లా నాతో చెప్పకుండానే ఈమెకు ఇచ్చెయ్యాలి. ఈమె మనస్సుకు కష్టం కలిగించే మాట ఒక్కటి ఎవరైనా అన్నారో తక్షణం వాళ్ళ ప్రాణాలు తీస్తాను,'' అని గట్టిగా హెచ్చరించాడు.





# మర్యాదయిన పద్ధతి

కువలయ్య భార్య పేరు ఏదైనా, అందరూ ఆమెను కువలమ్మ అనే అంటారు. ఎందు కంటే, ఆవిడ కూడా భర్తలాగే మహాపిసినారి. ఈ దంపతులకు పొరుగున రామయ్య, రామమ్మ ఉంటున్నారు. వీళ్ళ పద్ధతి కువ లయ్య దంపతుల పద్ధతికి పూర్తిగా భిన్నం. రామయ్య, రామమ్మ కూడా జాలిగుండె కలవాళ్ళు.

కువలయ్యది వడ్డీవ్యాపారం. వచ్చిన డబ్బు వెనకవేయడమే తప్ప ఖర్చు పెట్టడమంటూ వుండదు. వాళ్ళ దొడ్లో పళ్ళచెట్లున్నవి. ఆ పళ్ళల్లో ఒక్కగా నొక్కటైనా ఇరుగు, పొరుగు లకు ఇవ్వకుండా తినేస్తూంటారు కువ లయ్య దంపతులు. ఇంట్లో వంట చేయడ మంటూ ఎప్పుడోగాని జరగదు. ఎవరు భోజ నానికి పిలిచినా తత్రంగా పోయి కడుపారా తిని వస్తూంటారు.

ఒక రోజు రాత్రి కువలయ్య ఇంటి పెరట్లో తిరుగుతూండగా చెట్టు నుంచి సపోటా పండొకటి రాలి గోడ మీద పడి, పొరుగింటి దొడ్లోకి జారిపోవడం అతడి కళ్ళబడింది. అది చూసి కువలయ్య మనసు పాడైపోయింది. భార్యను పిలిచి, జరిగింది చెప్పాడు. వెంటనే గోడ దూకి పోయి పండు తెమ్మన్నది భార్య.

కువలయ్య గోడ దూకాడు. అప్పుడే అత డికి సపోటాపండుతోపాటు కొద్దిగా తెరిచి వున్న రామయ్య వంటింటి తలుపులు కూడా కనబడ్డాయి. వాళ్ళింకా నిద్ర పోలేదేమో పలక రించుదామని గుమ్మం దాకా వెళ్ళాడు కువ లయ్య. అయితే, వంటింట్లో ఎవరూ లేరు. కానీ, వంటకాల వాసనలు ఘుమఘుమ లాడుతున్నాయి. కువలయ్య చప్పున లోప లికి అడుగుపెట్టి, అన్నీ చూశాడు. అతడికి నోరూరింది. వంటకాలన్నీ పంచెలో మూట

25-ఏళ్ళనాటి చందమామ కథ



కట్టి, సపోటా పండుతో సహా గోడ దూకి ఇల్లు చేరాడు. జరిగింది విని భార్య, అతడు చేసిన పనిని మెచ్చుకున్నది. ఆ రాత్రి ఇద్దరూ కలిసి ఆనందంగా విందుభోజనం చేశారు.

మర్నాడు రామయ్య ఇంట్లో ఏదైనా గొడవ వినిపిస్తుందేమో అని, కువలయ్య దంపతులు ఎదురుచూశారు. కాని, అలాంటిదేం జరగలేదు. ''బొత్తిగా లక్ష్యం లేని మనుషులు! అన్ని వంటకాలు పోతే, పట్టనట్టూరుకుంటారా?'' అన్నాడు కువలయ్య.

''ఇలాంటి వాళ్ళ కొంపలోంచి, రోజూ అన్నం ఎత్తుకువచ్చినా ఫరవాలేదు,'' అన్నది కువలమ్మ.

అంతే! ఆ రాత్రి కూడా కువలయ్య గోడ దూకాడు. ఈ రోజు వంటింటి తలుపు వేసి వున్నది. కువలయ్య కాస్త తోసి చూస్తే, గడి దానంతటదే విడిపోయింది. కువలయ్య అన్నం ఎత్తుకుని వెళ్ళిపోయాడు.

మూడవ రోజున కువలయ్య గోడ దూకి వంటింటి తలుపులు తెరవగా, అతడికి అక్కడ వంటకాలే కాక, రెండు పీటలు వేసి వుండడం కనబడింది. వాటి ముందు రెండు విస్తళ్ళు పరిచివున్నాయి.

తనసంగతి రామయ్యకు తెలిసి పోయిందా అని, కువలయ్య అనుమానించాడు. చూద్దాం, ఏమైతే అదవుతుందని అతడు వంటకాలను విస్తళ్ళలోకి సర్దుకుని తీసుకుపోయాడు.

మర్నాడు రామయ్య ఇంటి ముందు చాలా జనం గుమిగూడారు. విశేషమేమిటో అనుకుంటూ కువలయ్య అక్కడికి వెళ్ళాడు.

రామయ్య అక్కడ చేరినవాళ్ళతో, ''మా ఇంటికి రోజూ భగవంతుడు వచ్చి, భోంచేసి వెళుతున్నాడు. మొదటి రోజున ఇంట్లో వంటకాలు మిగిలిపోతే, వాటిని దేవుడు తినేశాడు. నేను కుక్క తినేసిందనుకున్నాను. అయినా, విషయం తెలుసుకుందామని, రెండో రోజు కూడా వంటకాలెక్కువ వండాం. వంటింటి తలుపు వేసేశాం. అయినా, వంటకాలు మాయమయ్యాయి! ఇది కుక్క పనో, దేవుడి పనో తెలుసుకుందామని, మూడో రోజు విస్తళ్ళు కూడా వేశాం. ఈసారి విస్తళ్ళతో సహా వంటకాలు మాయమయ్యాయి. అంటే, ఇది తప్పకుండా దేవుడి పనే అయివుండాలి కదా?'' అన్నాడు.

జనం అంతా అవునన్నారు. ఈ వింత చూడ్డానికి రోజూ రాత్రి జనం రామయ్య దొడ్లో పోగవ

సాగారు. వారం రోజులు గడిచినా దేవుడు ఆ చాయల కేసి రాలేదు.

''దేవుడు ఇంతమంది కళ్ళెదుటికి వస్తాడా? రహస్యంగా చూడాలిగానీ,'' అన్నాడు రామయ్య. ఆ రోజు నుంచీ జనం రహస్యంగా చూడడం మొదలుపెట్టారు.

పాపం, కువలయ్యకిది చాలా ఇబ్బంది అనిపించింది. రామయ్య వెర్రిబాగులవాడు కాబట్టి, దేవుడొచ్చి తిని పోతున్నాడనుకు న్నాడు. అంతవరకూ బాగానే వుంది! కానీ, మధ్య ఇదేమిటి? జనమంతా కాపలా కాస్తుంటే తన తిండి సంగతి ఏం కావాలి? దేవుడొస్తాడని, ఏ వెధవ ఎక్కణ్ణుంచి రహస్యంగా వంటగది కేసి చూస్తున్నాడో తనకెలా తెలుస్తుంది?

ఈ ప్రచారాన్ని తిరుగుముఖం పట్టించడం కోసం కువలయ్య తన భార్యను ప్రోత్సహించి, రామమ్మ దగ్గిరకు పంపాడు. ఆమె రామమ్మతో, ''ఏమమ్మా, వదినా! రోజూ దేవుడొచ్చి మీ ఇంట్లో తిని పోతూంటే, ఆ సంగతి ఊరంతా డప్పు కొట్టించాడు అన్నయ్య. ఇప్పుడు చూడు మరి, దేవుడూ రావడం మానేశాడు. అటు అన్నయ్యకూ వెర్రిబాగులవాడన్న పేరు వచ్చింది,'' అన్నది.

''ఆయనేమీ అంత వెర్రిబాగులవాడు కాదమ్మా, ఆయనది జాలిగుండె, అంతే!'' అన్నది రామమ్మ శాంతంగా. ''అంటే?'' అన్నది కువలమ్మ ఆశ్చర్యపోతూ.

''వచ్చి తిండి తినిపోయేది దేవుడు కాదనీ, మనిషేననీ ఆయనకు తెలుసు. కాని, అంత రహస్యంగా వచ్చి తిండి ఒక్కటే తినిపోతున్నాడంటే వాడు తిండి కోసం ఎంతగా ముఖం వాచిపోయివున్నాడో అర్థం చేసుకోవచ్చు. అలాంటి వాడు గర్భదరిద్రుడై వుంటాడు! అన్నార్తుడికి అన్నం పెడితే, అది దేవుడికి



పెట్టినట్టే అని, ఆయన అంటూంటారు. అందుకే మేం చక్కగా విస్తరి కూడా వేసి, వాడు తిండి తిని పోయే ఏర్పాటు చేశాం,'' అన్నది రామమ్మ.

''మీ ఆయన జాలిగుండె సంగతి బాగానే వున్నది. వంట ఇంటికొచ్చి తిని పోతున్న వాడు గర్భదరిద్రుడు కాక, ఉన్నవాడేనేమో అన్న ఆలోచన మీక్కలగ లేదా?'' అని అడిగింది కువలమ్మ. ఒకవేళ తమ సంగతి రామమ్మకు తెలిసిపోతే, ఈ ప్రశ్నతో ఆ విషయం బయటపడుతుందని కువలమ్మ ఆశ.

''ఉన్నవాడైతే, అలా దొంగచాటుగా వచ్చి తిని పోవడం ఎంత సిగ్గుమాలిన పని! తను చేస్తున్న, ఈ సిగ్గుమాలిన పని బయట పడితే, వాడెంత అవమానం పాలయిపోతాడు. వాడిని అలా నలుగురిలో అవమానించడం ఆయనకు ఇష్టంలేదు. ఆయనది జాలిగుండె అని చెప్పాగదా? అందుకే దేవుడి పేరు చెబుతున్నాడు,'' అన్నది రామమ్మ.

''అలాంటప్పుడు, ఈ ప్రచారమంతా ఎందుకు? చాటుగా తినిపోయే వాడు, ఈ ప్రచారం వల్లనే గదా రావడం మానేశాడు. మీ ఇంటి దొడ్డిని దేవుణ్ణి చూడవచ్చన్న కోరికతో, ఎప్పుడూ ఎవరో ఒకరు రహస్యంగా చూస్తూండ వచ్చునన్న భయంతో, వాడు రావడం మానేసి వుంటాడు మరి!'' అన్నది కువలమ్మ.

''అదే కువలమ్మా మాక్కావలసింది! మేమే వంటింట్లో పొంచి వుండి వాడెవడో తెలుసుకో వచ్చు. కాని, వాడు మాకు స్నేహితుడో, ఏ పొరుగింటివాడో అయుంటే, ఎదటపడి మందలించి, వాణ్ణి అవమానపర్చలేం గదా? రహస్యంగా వచ్చి తిండి తినిపోయే సిగ్గుమాలిన పనిని మానిపించడానికి, మర్యాద అయిన పద్ధతిని ఎన్నుకున్నాం. ఏమంటావు?'' అన్నది రామమ్మ.

రామయ్య దంపతులకు తమను గురించి తెలిసిపోయిందనీ, తమ దురలవాటు మాన్పించడానికి మర్యాద అయిన పద్ధతి అనుసరించారనీ కువలమ్మకు అర్థమై పోయింది.

ఆమె ఇంటికి వెళ్ళి జరిగింది భర్తకు చెప్పింది. ఆ రోజు నుంచీ కువలయ్య దంపతుల పిసినిగొట్టుతనం క్రమంగా తగ్గసాగింది.



చిత్రాలు: గాంధి అయ్య

19

# అజేయుడు గరుడుడు!

రాజగురువు ఆకస్మిక ఆగమనానికి విస్మయం చెందిన ఆదిత్యుడు, ఆయనకు ఆలయ పునరుద్ధారణ పనులను చూపించాడు. ఆలయానికి త్వరలో కుంభాభిషేకం జరిపించాలని రాజగురువు సూచించాడు. చంద్రపురి మీదికి దాడి జరగవచ్చున్న వీరబాహు పంపిన రహస్యవార్తను ఒక భటుడు ఆదిత్యుడికి తెలియజేశాడు.




ప్రధానమంత్రి పుష్పరాజ్ భవనం నుంచి ఆయనకు ఎదురువచ్చాడు.










పుష్పరాజ్ ధీరసేనుణ్ణి రాజమందిరానికి వెంటబెట్టుకుని వెళ్ళాడు.
వజ్రపురికి స్వాగతం!
తమ దర్శనభాగ్యం కలుగుతున్నందుకు మహదానందంగా ఉన్నది.


భటులు పళ్ళూ, ఫలరసాలూ తెచ్చిపెట్టారు.
ప్రభూ, తమకు నేనేం చేయగలనో సెలవివ్వండి.
ఆ సంగతి పుష్పరాజ్ వివరించగలడు.
చంద్రపురిలో ఆదిత్యుడి పట్టాభిషేకోత్సవం వాయిదా పడింది.


అవును, అతని పట్టాభిషేకం జరగలేదని నాకూ తెలియవచ్చింది.
వజ్రపురిలో భవనం విరిగి పడిన విస్ఫోటనం నుంచి ఆదిత్యుడు తప్పించుకున్నాడు. అతడు ఆలయాన్ని చేరుకున్నాడని మాకు తరవాత తెలియవచ్చింది...
...సూర్యపురికి సమీపంలోని ప్రాచీన ఆలయానికి వెళుతూ అతడు వజ్రపురికి వచ్చాడు.


అతడు అక్కడ లేనప్పుడే చంద్రపురి మీదికి దండెత్తాలని మేము పథకం వేశాం.
అతడు తిరుగుప్రయాణంలో సూర్యపురి మీదుగానే రావచ్చు. నువ్వు అతన్ని రానీయకుండా అడ్డుకోవాలి.
అంతవరకు ఆగడమెందుకు? సూర్యపురికి రాకముందే, ఆలయంలోనే అతన్ని బందీగా పట్టుకుంటాం.


అదీ మంచి వ్యూహమే ధీరసేనా! దానిని గురించి మేము ఆలోచించలేకపోయాం. రాజగురువు కూడా ఇప్పుడు ఆలయాన్ని చూడడానికి వచ్చి ఉన్నట్టు మాకు వర్తమానం అందింది.


అలా అయితే, అయన్ను కూడా బందీగా పట్టుకుంటాం. చంద్రపురికి ఒక్కసారిగా జంట దెబ్బలు!


వాళ్ళిద్దరూ లేనప్పుడు, మేము సైన్యంతో వెళ్ళి చంద్రపురిని పట్టుకుంటాం.
అందుకే ఆదిత్యుడు దూరంగా ఉండాలని మీరు ఆశిస్తున్నారన్న మాట!


నీ ప్రయత్నం జయప్రదం కావాలని ఆశిస్తున్నాం. సూర్యపురి నుంచి శుభవార్త కోసం ఎదురు చూస్తుంటాం.
చిత్తం, ప్రభూ! ఇక నేను సెలవు తీసుకుంటాను!


పుష్పరాజ్ బావమరిదిని సాగనంపాడు.
అతడు తప్పక విజయం సాధించగలడు. అందులో సందేహం లేదు.


అక్కడ ఆలయంలో పవిత్రీకరణ జరపడం గురించి రాజగురువు, ఆదిత్యుడికి సలహా ఇచ్చాడు.


ఆదిత్యుడు కొబ్బరి నీళ్ళు, పాలు, తేనె, పుణ్య నదుల నుంచి తెచ్చిన పవిత్ర జలం మొదలైన వాటితో విష్ణు విగ్రహాన్ని భక్తితో అభిషేకించాడు.




ఆ ఉత్సవానికి శిల్పులు, కళాకారులు, కార్మికులు హాజరయ్యారు. కొద్ది దూరంలో భటులు నిలబడ్డారు.


ఆదిత్యుడు చేతులెత్తి నమస్కరిస్తూన్నప్పుడు హఠాత్తుగా...


...వింత తేజోవలయం ఆదిత్యుడి చుట్టూ వ్యాపించింది.
దేవదేవా! నా రాజ్యాన్ని కాపాడు! నా ప్రజలను ఆశీర్వదించు!


ఇలాంటి దృశ్యాన్ని నేను ఎన్నడూ చూడలేదు. భగవంతుడు నిన్ను నిజంగా ఆశీర్వదించాడు. నిన్ను సర్వవేళలా రక్షించగలడు.


ఈ తతంగం ముగిసిందనుకుంటాను. ఇప్పుడు తమరు చంద్రపురికి వెళ్ళి రాజుగారికి ఇక్కడి సంగతులను తెలియజేయండి. పునరుద్ధారణ పనులు పూర్తికాగానే నేను తిరిగి వస్తాను.


మిగిలిన పనులను మరెవ్వరికైనా అప్పగించి నువ్వు రావచ్చు కదా? మహారాజుగారు, యువరాణి అరుణ నిన్ను చూడాలని ఆతృతగా ఉన్నారు.


నన్ను గురించిన విచారం వద్దు గురువర్యా! మనలందరినీ ఆ దేవుడే రక్షించగలడు!
నువ్వు ఇంతగా చెబుతున్నావు గనక, బయలుదేరుతున్నాను.


రాజగురువు ఒక భటుడి వెంట బయలుదేరాడు.
ఇక, నేను నా పూజలను కొనసాగిస్తాను.


యజ్ఞకుండంలోని సమిథలు ఇంకా ఆరలేదు.


ఉన్నట్టుండి ఒక అగ్నిజ్వాల ఎగిసి పడింది. ఆదిత్యుడికి వింత కంఠస్వరం వినిపించింది.
''నీకు హాని చేయడానికి శత్రువులు ఆలయాన్ని సమీపిస్తున్నారు. గరుడుడి గుడి లోపలికి వెళ్ళు!''
-(ఇంకావుంది)

# హంపి



దక్షిణ భారతదేశంలో హోయసాలవంశం అంతరిస్తున్న సమయంలో మంత్రులుగా వున్న అక్కరాయలు, బుక్కరాయలు అనే అన్నదమ్ములు సొంతంగా సామ్రాజ్యం స్థాపించాలని సంకల్పించారు. అందుకు ఈనాటి కర్నాటక రాష్ట్రం బళ్ళారి జిల్లా తుంగభద్రా నదీ తీరంలో ఒకనగరాన్ని నిర్మించడానికి తలపెట్టారు. అది కన్నడంలో హంపె అని పిలువబడి కాలక్రమంలో హంపిగా మారింది. మూడు వైపులా కొండలు, ఒకవైపున నది నగరానికి సహజ సరిహద్దులుగా ఉండగలవని అన్నదమ్ములు భావించారు.

14-16 శతాబ్దాల మధ్య రెండు వందల సంవత్సరాల కాలంలో విజయనగర రాజులు రాజధానిని అత్యున్నత స్థాయికి అభివృద్ధి పరిచారు. పాలకులు భక్తులు కావడంతో నగరంలో అనేక దేవాలయాలు వెలిశాయి. వాటిలో ప్రధానమైనది నగర మధ్యంలోని విరూపాక్ష మందిరం.

విజయనగర సామ్రాజ్యం వైభవోపేతంగా వెలిసింది. 1565లో కొందరు ముస్లిం పాలకులు అన్నివైపుల నుంచి ఒక్కసారిగా విజయనగరం మీదికి దండెత్తి నాటి సేనాధిపతి రామరాయలను ఓడించి, నగరాన్ని దోచుకుని, చిన్నాభిన్నం చేసి హంపిని శిథిలాలుగా మిగిల్చారు.

1986వ సం.లో యునెస్కో హంపీ శిథిలాలను ప్రపంచ వారసత్వ జాబితాలోకి తీసుకున్నది. మూడు వైపులా నల్లటి బండల కొండలు, ఒకవైపు తంగభద్రానది మధ్య ఈ శిథిలాలు 26చ. కి.మీ. విస్తరించి ఉన్నాయి.

700 మీ. పొడవైన విశాలమైన వీధితో విరూపాక్ష మందిరం; సర్పం ఏడుపడగల నీడలో బ్రహ్మాండమైన ఉగ్రనరసింహ ఏకశిలా విగ్రహం, విఠ్ఠల ఆలయానికి చెందిన రాతిరథం, రాజకుటుంబాలకు చెందిన స్త్రీలు నివసించిన రెండంతస్తుల అందమైన పద్మ మహల్ మాత్రమే ఇప్పుడు చారిత్రక సాక్ష్యాలుగా నిలిచి ఉన్నాయి!

# వార్తలలో బాలలు

## గిన్నిస్ బుక్ రికార్డు కోసం



ఎల్.ఎస్. శివశ్రీకి పట్టుమని ఆరేళ్ళు కూడా లేవు. గత ఫిబ్రవరి నెలలో గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో స్థానం సంపాదించడం కోసం ఆ చిన్నారి 169 నిమిషాలలో 29.4 కి.మీ. దూరం పరిగెత్తింది. తమిళనాడు రాష్ట్రం విళుప్పురంలో ఒకటవ తరగతి చదువుతున్న ఈ అమ్మాయి 2006వ సం.లోనే మారథాన్ పరుగులకు శిక్షణ ఆరంభించింది. గత సం. ఆగస్ట్ నెలలో గంటకు 8.7 కి.మీ. దూరం పరిగెత్తిన ఆ అమ్మాయి అక్టోబర్ నెలలో 130 నిమిషాలలో 20 కి.మీ. దూరం పరిగెత్తింది. ఆమె తండ్రి స్క్రీన్ ప్రింటర్, కోకో ఆటగాడు. తన కూతురిని మంచి క్రీడాకారిణిగా చేయాలన్నది ఆయన కోరిక. ఆ పాపాయిని గురించి విన్న వెంటనే, తమిళనాడు ముఖ్యమంత్రి ఆమెను చెన్నయ్‌కి పిలిపించి, ఆమె శిక్షణా కార్యక్రమానికి రాష్ట్రప్రభుత్వం తరపున తగిన సాయం అందించగలమని చెప్పి ప్రోత్సహించారు.

## అతి పిన్నవయసు బ్లాక్ బెల్ట్



జియూ-జిట్సూ, కరాటే, కుంగ్-ఫూ, టీక్వాండో వీటి మధ్య ఉన్న సామ్యం ఏమిటో తెలుసా? అవన్నీ చైనాలోనూ, జపాన్‌లోనూ పుట్టిన యుద్ధ కళలు. ఇటీవల కొరియా సియోల్‌లో జరిగిన ప్రపంచ టీక్వాండో పోటీలో ఢిల్లీ సంస్కృతి స్కూల్ విద్యార్థి జయ్‌కరణ్ కన్వార్ (8) పాల్గొని అత్యున్నతమైన గుర్తింపయిన బ్లాక్ బెల్ట్ సాధించాడు. ఆసియాలోనే అతి పిన్నవయసు బ్లాక్ బెల్ట్‌గా ప్రకటించబడ్డాడు. న్యాయనిర్ణేతలలో ఒకరు, ''గొప్ప విజేతలలో మాత్రమే కనిపించే వేగం, ఏకాగ్రత ఈ కుర్రాడిలో చూశాను,'' అని ప్రశంసించాడు. ఇప్పుడే మూడో తరగతిలో ప్రవేశించిన జయ్‌కరణ్ గణితంలో దిట్ట. జపాను పద్ధతిలో లెక్కలు వేయడానికి ప్రయత్నిస్తున్నాడు.

---

## చందమామ ఇండియా క్విజ్ - 5 (జూన్ '07)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు. అందువల్ల బహుమతి ఇవ్వలేక పోతున్నాం. చందమామ ఇండియా క్విజ్-5 సమాధానాలు 32వ పేజీలో ఇవ్వబడ్డాయి.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....




## విజ్ఞాన వీచికలు :

### క్యాన్సర్‌ను అడ్డుకునే చాక్లెట్లు

పిల్లలకే కాదు, చాక్లెట్లంటే అందరికీ ఇష్టమే కదా. వీటిని ఎక్కువగా తింటే అతిగా లావెక్కుతారనీ, పళ్ళు పుచ్చి పోతాయనీ, కడుపులో నులిపురుగులు పడతాయనీ అనుమానిస్తారు. ఇటీవల జరిగిన పరిశోధనల ద్వారా చాక్లెట్లు క్యాన్సర్‌ను నయంచేయగలవని తెలియవచ్చింది.

అమెరికాలోని కార్నెవెల్ విశ్వవిద్యాలయానికి చెందిన శాస్త్రవేత్తలు వేడి చాక్లెట్, క్యాన్సర్‌ను బలంగా నిరోధించే అవకాశం ఉందని కనుగొన్నారు. క్యాన్సర్‌ను అడ్డుకునే గ్రీన్‌టీ, బ్లాక్‌టీ, రెడ్‌వైన్ మొదలైన పానీయాలతో వేడి చాక్లెట్‌ను పోల్చి చూశారు. ఈ పానీయాలన్నిటిలోకీ హాట్ చాక్లెట్ మిన్నగా పనిచేయడం చూసి ఆశ్చర్యపోయారు. చాక్లెట్‌లోని కోకోలో క్యాన్సర్‌ను కలిగించే 'ఫ్రీ-ర్యాడికల్స్'కు వ్యతిరేకంగా పోరాడే రసాయనిక పదార్థాలయిన యాంటి-ఆక్సిడెంట్స్ విరివిగా ఉన్నాయట. ఫ్రీ-ర్యాడికల్స్ శరీరంలో సహజంగానే ఏర్పడతాయి. ఒక నిర్ణీత స్థాయివరకు హాని చేయవుగాని, ఒక స్థాయి దాటితే అవి ప్రమాదకారులుగా పరిణమిస్తాయి.

## మన పరిసరాలు




### పంచదార దారాలు

ఉత్సవం, ఎగ్జిబిషన్, ఇలా జనసమ్మర్దం ఉండే చోటికి వెళితే పిల్లలకు 'కాండీ ఫ్లాస్' తింటే తప్ప అక్కడికి వెళ్ళామన్న తృప్తి మిగలదు. తియ్యతియ్యగా దారాలు దారాలుగా ఉన్న వాటిని పిల్లలు సరదాగా తింటూంటారు. అలా తినేప్పుడు అది దారాలుగా తయారైన పంచదార అని ఎప్పుడైనా ఊహించారా? అవును, అది పంచదారే. జాగ్రత్తగా చూశారంటే ఆ మిఠాయి అమ్మే వ్యక్తి, అతని ముందున్న లోతైన గుండ్రటి చిన్న పాత్రలోకి పంచదార పోయడం తెలుస్తుంది. ఆ తరవాత అందులోకి కొద్దిగా తినే రంగులు కలుపుతాడు. ఈ చిన్న పాత్రకు మరీ సన్నటి రంధ్రాలుంటాయి. లోపలే హీటర్ కూడా ఉండడంతో అది పంచదారను ద్రవంగా మారుస్తుంది. చిన్న మోటార్ తిరుగుతూంటే సన్నటి రంధ్రాలగుండా ద్రవం వెలుపలికి చిమ్మబడుతుంది. వేడిగా వున్న ఆ ద్రవానికి గాలి తగలగానే, గట్టి పడడంతో గుండ్రటి పళ్ళెంలో పంచదార దారాలు చుట్టలుగా ఏర్పడతాయి.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.







NARAYANAMURTHY TATA

S BALASUBRAMANIAN

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్టుకార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు అక్టోబర్ 2007 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 032.

## అభినందనలు

జూన్ నెల పోటీ ఫలితాలు
వి. జవహర్
9వ తరగతి బి 1, రూమ్ నం. 68
భాష్యం రెసిడెన్సియల్ స్కూల్
గోరంట్ల పోస్ట్
గుంటూరు జిల్లా (ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : కన్నతల్లిని మరిపిస్తా!
రెండవ ఫోటో : కన్నవారిని మురిపిస్తాం!!

## సమాధానాలు :

1. బాలగంగాధర తిలక్. 2. బీహార్‌లోని చంపారన్ జిల్లాలో 1917 ఏప్రిల్ 18వ తేదీ. 3. నేతాజీ సుభాష్ చంద్రబోస్. 4. 1931లో జరిగిన రెండవ సమావేశం. 5. పంజాబు: భగత్ సింగ్, సుఖదేవ్; బెంగాల్: రాష్‌బెహారీ బోస్; జతిన్ ముఖర్జీ.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 032. Editor : B. Viswanatha Reddi (Viswam)

# వంట చేయడంలో ఇంధన సామర్థ్యం!



ప్రియకు పదకొండేళ్ళు. అన్నపూర్ణా కేటరింగ్ కాలేజీలో పనిచేస్తున్న ఆమె తల్లి తమ కళాశాలలో సీనియర్ విద్యార్థులకు జరుగుతూన్న వంటల పోటీని చూడడానికి ప్రియను వెంటబెట్టుకు వెళ్ళింది.

ఆరోజు వంటల పోటీలో తయారైన వంటకాలలో సునీత, వందన తయారు చేసిన వంటకాలు ఉత్తమ మైనవిగా నిర్ణయించబడ్డాయి. ఆ తరవాత వారిద్దరినీ ఒకే రకం వంటకం తయారు చేయమని చెప్పారు. కొంతసేపటికి వంటలు తయారయ్యాయి. ఇద్దరు తయారు చేసిన వాటి నుంచి కొంత తీసి అందరినీ రుచి చూడమన్నారు. సునీత చేసిన వంటకం చాలా రుచిగా ఉందని అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు. అయితే, కాలేజీ ప్రిన్సిపాల్ వందనను విజేతగా ప్రకటించి అందరినీ ఆశ్చర్యపరిచారు!

''వందన తయారుచేసిన వంటకం కన్నా సునీత వండిన వంటకం కాస్త ఎక్కువ రుచిగా ఉందని నేనూ అంగీకరిస్తున్నాను. అయితే, విజేతను నిర్ణయించడానికి నేను వార్దిదరూ వంట చేసిన పద్ధతులను కొలమానంగా తీసుకున్నాను. ఆ విషయంలో వందన సమర్థురాలు. గ్యాస్ ముట్టించడానికి ముందే ఆమె అన్నిటినీ సిద్ధంగా ఉంచుకున్నది. మూడు రకాల పదార్థాలను ఒక్కసారిగా ఉడికించడానికి ఆమె ప్రెషర్–కుకర్‌ను ఉపయోగించింది. వంట చేయడానికి ఆమె వెడల్పాటి, లోతు అంతగా లేని పాత్రను ఉపయోగించింది. అందువల్ల వేడి అన్ని వైపులకూ సమానంగా వ్యాపిస్తుంది. అయితే సునీత, స్టవ్ ముట్టించిన తరవాత, పదార్థాలను సిద్ధంచేయడం మొదలు పెట్టింది. ఆమె ఒక్కొక్క పదార్థాన్ని విడివిడిగా ఉడికించింది. అందువల్ల సమయం, గ్యాస్ రెండూ వృథా అవుతాయి. ఆమె వంటకు వాడిన పాత్రలు నిలువుగా, లోతుగా ఉన్నాయి. మనకు ఎల్పిజి అంతంత మాత్రంగానే లభ్యమవుతున్నది. దానిని వృథా చేయకుండా జాగ్రత్తగా ఉపయోగించడం మన అందరి బాధ్యత. తెలివైన వంటపద్ధతులను అవలంబించడంలో వందన అందరికీ రోల్‌మాడల్‌గా ఉంటోంది.''

CHANDAMAMA (Telugu) Aug 2007 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08



# Ram and Shyam

## Colourtown Rescued

హుమ్...పాపిన్స్!






















